# శ్రీ రామాంజనేయము

అను

సారధి నాటకము ★ కాంతిప్రచురము

మల్లెల జయరామయ్య

హస్తాక్షరము

శ్రీ శారదాంబాయైనమః

# SRI RAAMAANJANEYAM.

# శ్రీ రామాంజనేయము

అను

(నారదనాటకము  శాంతిసమరము)



రచయిత:

మల్యాల జయరామయ్య,

పెద్దాపురము.

సర్వస్వామ్యసంకలితం) 1951 (మూల్యం రు. 1-4-0.

First Impression:
August, 1951.

1000 Copie

# శ్రీ రామాంజనేయము.

(నారద నాటకము—శాంతిసమరము)

## నాంది.

జగతి నజాతశత్రుఁడను సత్యముఁ జాటు మహోగ్రమూర్తి కాఁ
దగియును దా గృతార్థుఁడయి తల్లి ఋణంబును దీర్పగా ప్రభున్
నగుచుఁ దిరస్కరించిన రణంబునఁ బోనిన యుక్తి ధాత్రిపై
రగులుచుగాత "శాంతి సమరంబ"ను "నారద నాటకస్థ"మై.

(నాంద్యంతమునఁ బూలు చల్లబడిన వెనుక)

గుణగ్రహణపారీణులగు ఓ కవిపండితగాయకజనాగ్రేసరులారా నానావిధాలంకారభూయిష్టంబును, బహుళరసాశ్రయంబును, వివిధకళా పాత్రశోభితరంగస్థానంబును నైన నాంధ్ర నాటకసముద్రరంగంబునకు న నా యర్పించు శ్రీరామాంజనేయ (శాంతిసమర) మను నారద నాట మొక తుషారబిందువు; నెఱసుల నెన్నక గుణములున్న పరిగ్రహింతుర గాక!

## అంకితము.

నాటక రచయితలను నిర్లక్ష్యం చేయకుండా వారి హక్కులన గుర్తిస్తూ గౌరవించే నటవర్గానికి, నాటకసంఘాలకు ఈనాటకాన్ని సమ ర్పిస్తున్నాను.

ఇట్లు విన్నవించు విధేయుడు,
మల్యాల జయరామయ్య.

# శ్రీ రామాంజనేయము.

## శాంతిసమరము.

## నారదనాటకము.

---

## ప్రథమాంకము.

(ప్రదేశము—విశ్వామిత్రుని ఆశ్రమప్రాంతము. ప్రవేశము—నారదుఁడు)

నారదుఁడు:—(హరినామసంకీర్తనము చేసికొనుచు ప్రవేశించి నిష్క్రమించుచుండగా)

విశ్వామిత్రుఁడు:—(ప్రవేశించి, నమస్కరించి) కలహాభోజనా! శంకించుచునే ప్రయాణించుచున్న నాకు నీ ఒంటి బ్రాహ్మణ శకునమటయ్యా!

నార:—బాగు బాగు. నీవు బయలుదేరుచుంటివని నాకేమి తెలియును? అయిన నీప్రయాణ మెచ్చటికి?

విశ్వా:—మఱల నిది రెండవ యపశకునమా? పెట్టిన పేరా కలహాభోక్త. శకునమా రానే వచ్చితివి! పైగా "ప్రయాణమెచ్చటికి?" అను అడ్డు ప్రశ్నమా! చాలునయ్యా! నాకు మరల నెట్టి అవమానము చుట్ట బెట్ట దలచితివేమి?

నార:—నారాయణ! అజ్ఞానులగు లోకులవలె విజ్ఞానివగు నీవును నన్ను పాపము చేసికొనిన దోషిని నేనా? పోనిమ్ము—దోష నివృత్త్యర్థము పాదప్రక్షాళనాదికముల గావించుకొనిరమ్ము, పోవుదము.

విశ్వా:—తిరుగుమొగము పెట్టుటమాత్రము దుశ్శకునముకాదా! ఇందే కొంత నిలిచిపోవచ్చును. కాదగిన దుశ్శకునము లన్నియు—

నార:—వాని దోషదృష్టి తగలవలసియే యున్న తప్పునా? ఇంక నీప్రయాణ మెచ్చటికో!

విశ్వా:-ఎచ్చటికా? కాశీరాజ్యాధిపతి యయాతిరాజేంద్రుని కొల్వునకు. అచ్చట విజ్ఞానధనులగు మునీశ్వరుల నందర నాహ్వానించి, వేదాంత గోష్ఠి నేర్పాటు చేయుచున్నా డతడు. నీకాహ్వానము రాలేదా?

నారః:-త్రిలోకసంచారిని నాకాహ్వాన మెందులకు? పైగా బ్రాహ్మణు డను-ఆహ్వానము లేకపోయిన పోగూడదా! నీవును అచ్చటికేనా?

విశ్వా:-ఏమా ఆశ్చర్యము? పిల్వని పేరంటమునకు నీవే వెడలుచుండ ఆహ్వానింపబడి నేనేగుచుంటకే అబ్బురపడుచుంటివా?

నారః:-అదికాదోయి! నీవును అచ్చటికే వచ్చుచుంటివనిన నేనిచ్చటికి రావలసిన అగత్యమేలేదు. నీవు రావేమోయన్న సంశయముచేతనే నేనిచ్చటికి వచ్చితిని. నారాక నిన్నవశ్య మచ్చటికి గొంపోవుటకే!

విశ్వా:-నాయాగమనమున కంతటి ప్రాముఖ్యమేల యిచ్చుచుంటివయ్యా?

నారః:-విజ్ఞానధనుడవు, ప్రజ్ఞావంతుడవు——

విశ్వా:-కాదు, అందేదియో పరమార్థముండకపోదు.

నారః:-అపారమగు పరమార్థమున్నది; నీయంతటి ప్రజ్ఞావంతు డాసభ నలంకరింపకున్న నది సభయగునా కౌశికా!

విశ్వా:-నీపొగడ్తల కేమిలెమ్ము.

నారః:-యథార్థము పలికిన పొగడ్తలవలెనే నీవంటి సజ్జనులకు తోచును. ఇందలి పరమరహస్య మేమనగా-ఈనాటి సభ కధ్యక్షునిగ వసిష్ఠుని నియమింపనున్నాడట ఆరాజు.

విశ్వా:-ఆఁ! ఏమి?

నారః:-అగును. నీయంతవాడుండగా వసిష్ఠుని-వసిష్ఠునా అధ్యక్షునిగా ...! నీవేమి సామాన్యుడవా కౌశికా!

గీ. భుజబలంబును మించు తపోబలంబ
 టంచు రాజ్యంబునే విసర్జించినావు;
 మించు ఋషివన్న ఖ్యాతి గడించినావు;
 అల వసిష్ఠుండు నీసాటియా! మునీంద్ర!

విశ్వా:-ఏమీ! ఆమెత్తని దొంగకా అగ్రాసనాధిపత్యము!!

నార:-అగును. నీవంటివారిని చిన్నబుచ్చుటకేనా ఆధూర్త యయాతి ప్రియత్నము? ముక్కుడి మునిముచ్చులందరు అరుంధతీపతి పెత్తనమునకే తాళము వేయుచున్నారు. ఇప్పుడు నిజమునకు కొంత నోరు కలవాడవు—నీవైన ప్రతిఘటింతువని అస్మదాదు లాశించుచున్నారు. సామర్థ్యమున్నది, సాహసమున్నది. స్వాధిపత్యమునకు నీవే పోరాడకున్న ప్రతికక్షుల నిరంకుశత్వమునకు మేరయుండునా, కౌశికా?

విశ్వా:-మస్తుల దౌష్ట్యమును తప్పక ప్రతిఘటింపవలసినదే నారదా! నాశక్తిసామర్థ్యములు లోకు లర్థముచేసికొనరేల యన్న క్రోధము నాలో నానాటికి మితిమీరి ప్రజ్వలించుచున్నది. జితేంద్రియత్వ మార్జించిన నాకు ఈయహంభావమును జయింప సాధ్యము కాకున్నదోయి!

ఉ. పావనయోగమున్ బడసి బ్రహ్మకు మారుగ సృష్టిచేసితిన్;
ధీవిలసిల్లు నాదయిన తేజము నించకయేని లోకముల్
భావన సేయవన్న—గురుభావము చూపరటన్న—ఆయహం
భావము చావకున్నదిసుమా! ఎవరేమనుకొన్న నారదా!

నార:-పవిత్రమగు నగ్నికి ప్రజ్వలించుట స్వభావమేకదా! పదను లేకున్న కత్తి కలిగియు నేమి ప్రయోజనమయ్యా? సామర్థ్యమున్న వారికి అహంభావముండుట తప్పులోనిదికాదు. వీనియందొకటి లేకున్న రెండవది రాణించదు. అహంభావమే లేకున్న నెంతటి సమర్థునైనను లోకము గణింపదు. పైగా తృణీకరించును. ధీమంతునకు అహంభావము తప్పక వన్నె తేగలదు.

విశ్వా:-వన్నెయే తెచ్చుగాక! మచ్చయే వచ్చుగాక! అది నాతత్త్వము.

నార:-మచ్చయా! నీవంటివానికి మచ్చయా? (స్మృతి నభినయించి) అగునగును; నాడు సత్యహరిశ్చంద్రియమున కొంచెము తారుమారయినవి నీప్రయత్నములు.

విశ్వా:—మనశ్శల్యమై అదియే నా అహంభావమును రెచ్చగొట్టుచున్నది. ఆవసిష్ఠుని యెన్నటికైన నిర్జింపక పోవుదునా అని పరితపించు చున్నాను.

నార:—పరితాపము కాదామరి! పట్టుదలగల బ్రహ్మజ్ఞానివి.

ఉ. మంచి తపోధనుండవు అమాయకుడౌ నృపుచే నబద్ధమా
డించగ లేకపోయితి శ్రమించియు నీవు, గ్రహాంబులన్ని వ
క్రించెను నాడు, నిత్యము నొకే గతి నుండదు జాతకంబు లె
మ్మించుక ధైర్యమూని యెదిరించి విరోధి జయింపుమో సఖా!

విశ్వా:—ధైర్యమునకేమి, జయించుటకేమి, పాపిష్ఠి వసిష్ఠునిమీది పట్టుదలచే సచ్ఛీలుని సత్యహరిశ్చంద్రుని నానాకష్టముల పాలు చేసితినే. మరల యే అమాయికు లెందు చిక్కుకొందురో!

నార:—బాగున్నది. ఎవరో నష్టపోయెదరని స్వర్గమునకు సున్న చుట్టుకొందుమా! పైగా అందరికికొన్న హరిశ్చంద్రుని గుణముమాత్రము గీటుపెట్టబడలేదా! నీవు కొంచెము లోకుల దృష్టిలో అప్రతిష్ఠ పాలైతివి కాని పేరుప్రఖ్యాతులూ అతనికి దక్కినవి. లోకమునకా గుణపాఠము వచ్చినది. అంతియె కాని నాటి ప్రయత్నము లెవరికి నష్టదాయకమయ్యా!

విశ్వా:—కావుననే సంశయింపవలసివచ్చినది. మన ప్రయత్నములు పరుల ఘనతకే దారితీయుచున్నపుడు మనము మాత్రము మేల శ్రమియింపవలెనా యని—

నార:—ఏమి! ఇవి విశ్వామిత్రుని ముఖస్థముగ వినవలసిన మాటలేనా? నీవెంత ఋషిత్వమును స్వీకరించినను రాజర్షివని విస్మరించితివా? రాజసము నింతలో నెట్లు దిగమ్రింగితివోయి? ఔనౌను. నీవిట్లు సందేహింతువనియే నేనును శంకించితిని. కానిమ్ము. ఏది యెట్లు జరుగవలసిన యోగ్యత యున్నదో! కాని ఒక్కమాట. విశ్వామిత్రా! నీ ఆశ్రమమున నీవు కూర్చుండి ఘనుడ వనుకొనినంత నేమి ప్రయోజనమయ్యా? ఎవరి డప్పు వారు వాయించుకొనకున్న పరులు వాయింతురటయ్యా? నాకుమాత్రి మెందులకీ కంఠశోష? వసిష్ఠు డందల

మెక్కిన నేమి? విశ్వామిత్రుడు అరప నెక్కిననేమి? నారాయణ! (పోబోవును).

విశ్వా:—నారదా! నారదా! ఇంతకు నన్నేమి చేయుమందువోయి?

నార:—ఏమందునా!

గీ. అలవి యగునేని అగ్రాసనాధిపత్య
మును వహించుటే! అటు బుద్ధిపుట్టదేని
మంచిదే! పోయి జప మాచరించుకొనుము
ముక్కు మూసుక ఆశ్రమభూమియందె.

విశ్వా:—ఏమంటివి నారదా! "ముక్కుమూసుక జపమాచరించుకొనుము"—ఎంత తేలికగ మాట్లాడితివి? ఇతడు విశ్వామిత్రుడు! రాజర్షి! వీనికి నేర్పుచుంటివా? బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేసిన నన్నా రెచ్చగొట్టుచుంటివి! ముక్కు మూసుక జపమాచరించు మునుల ధిక్కరించి జయించుటకే రాజ్యభోగముల విసర్జించితిని. సాత్వికమును రాజసముచే ఓడించుటకే సాత్వికుడనైతిని నేను. కన్నెఱ్ఱచేసితినా—మునికుల ప్రళయమే. పాషాణము నానుండి కర్కశత్వమభ్యసించి కఠోరమైనది. సింహకిశోరము పౌరుషము గ్రహించినది నన్ను జూచి. వ్యాఘ్రము నాయొద్ద క్రౌర్యము నేర్చుకొన్నది. సర్పరాజమునకు పగ సాధించుట నేర్పినది నేను. నాతలంపున సృష్టియే లయము కాగలదు. చూచెదవుగా నాప్రభావము! (నిష్క్రమించును).

నార:—సెబాస్! ఇప్పుడు కదా యథార్థమగు రాజర్షివి నీవు!

గీ. నిజమునకు రౌద్రరసము రాణించునట్లు,
శాంత మొప్పదు నీకు, నీసత్వమునకు;
భాస్కరునకు, గ్రీష్మంబు శోభస్కరంబు
గాని హేమంతమందు ప్రఖ్యాతిగలదె?

(హరినామసంకీర్తనముతో నిష్క్రమించును. తెరపడును).

---

# శ్రీ రామాంజనేయము.

## ద్వితీయాంకము.

---

(ప్రదేశము:—యయాతి రాజేంద్రుని సభాప్రాంగణము. ప్రవేశము:—
యయాతి, నారదుడు)

యయాతి:—దేవా! ఏమట్లు సంశయించుచున్నారు? నిష్కల్మష చిత్తము
తోడనే తలపెట్టితినే ఈసత్కార్యమును నేను.

నారదుడు:—నిష్కల్మష చిత్తుడవే! సత్కార్యమే! సంశయము లేదు.
కాని నీవొకరికి చేయు సత్కార మింకొకరికి శిరచ్ఛేదము.

యయాతి:—అనగా? వసిష్ఠులవారివంటి యోగ్యులను గౌరవించుట కిట్టని
ఈర్ష్యాళువు లెవరీ సప్తర్షిమండలమున?

నార:—అమాయకుడా! లోకమం దొకరి గౌరవము వేరొకరి పరాభవము
నకు కారణ మగుటకే అబ్బురపడుచుంటివా? అది జనసామాన్య
మగు లోపమే గదా! మరియు వసిష్ఠున కాజన్మవిరోధిని విశ్వా
మిత్రుని విస్మరించితివా? అట్టివాడ వాతనికేల పంపితి వాహ్వానము?

యయాతి:—వారియందలి గురుభావముననే.

నార:—అదియే విపత్కర విపరీత పరిస్థితులకు కారణము.

ఉ. నేడు సభాధిపత్యమును నీవు వసిష్ఠున కిచ్చెదేని పో
రాడగ వచ్చు గౌశికుడు, అతనితో పగ యెంతవారికిం
గూడ ప్రమాదమే! పరమకోపి యతండు; వసిష్ఠు నెట్టులో
వేడుకొనంగవ చ్చుతడు పెంచడు కయ్యము శాంతు డెప్పుడున్.

యయా:—నిజమే మునీంద్రా! నిదానించలేకపోయితిని. ఇది గొప్పచిక్కే!

నార:—తెలియక చేసిన పొరబాటు తెలిసి సవరించుకొనుము.

యయా:—ఎట్లు?

నార:—ఎట్లా! విశ్వామిత్రుని పిల్వనే పిల్చితివి; కాన సభాధిపత్యమొసంగి—

యయా:—వసిష్ఠులవారి కపచారము చేయుమందురా?

నార:—అపచారమో? ఏమో?

గీ. అల వసిష్ఠ విశ్వామిత్రులందు నెంచ
కూ్రరుడా కౌశికుని కొంత గొప్పజేసి,
చిక్కు తప్పించుకొన్న, వసిష్ఠు కాళ్ళు
పట్టుకొని క్షమాపణ వేడవచ్చు పిదప.

వారిద్దరిలో ఎవరికో ఒకరికి నీవపచారము చేయుట తప్పదు. వారి కోపమునకు గురికాకను తప్పదు. నిజమునకు విశ్వామిత్రుని కోపానల జ్వాలకు నీవంటి అమాయకుడు తట్టుకొనజాలడు.

యయా:—దేవర్షీ! మీమాట మన్నింపలేనందులకు క్షమింపుడు.

చ. పిలిచితి నిర్వగన్ సభకు; పెద్దగ నొక్కరి చేయ నన్యు లి
ట్లలుగుట ధర్మమేయగున? అంతయె వచ్చిన నేమిసేతు, తా
దలచిన దేదియో యగును, తప్పదు, కాని అరుంధతీపతిన్
పిలిచితి నాధిపత్యమును స్వీకృతిచేయు డటంచు, నిప్పుడీ
కలతకు జంకి వారి నిట కాదనవచ్చున! మౌనిచంద్రమా.

అధ్యక్షునిగ నాహ్వానించి వేరొకరి కగ్రపీఠం బొసగుట వసిష్ఠులవారి కెంతటి అవమానము! విశ్వామిత్రులవారి కోపానలంబున నే భస్మమైనను సంతోషమే. కాని ఆడితప్పుట భావ్యమా, స్వామీ?

నార:—ధర్మపద్ధతినే వర్తింపవలెనన్న, జీవితమే దుర్లభమోయి. కొంచెము లౌక్య ముపయోగించిన గాని—

యయా:—ధర్మము నాయందున్నదని ధైర్యమున్నది. లౌకిక జ్ఞానము ప్రకృత తటస్థ విజయమును సాధించినను అది శాశ్వతముగ నిల్వదని నాతలంపు. లౌకికతంత్రపరిజ్ఞానముతో మీబోంట్లు నన్నిట్టి విషయముల పరీక్షించుటకు ప్రయత్నింప కుందురని ప్రార్థించుచున్నాను.

నార:—నాకెందులకయ్యా! నిజమాడిన నిష్ఠురముగదా! నీయిష్టము. నాకెందులకు?

యయా:—మీవంటివారు నిరాదరము, నిర్లక్ష్యము చూపక నాపట్లకొంత సుముఖులు కావలయునని వేడుకొనుచున్నాను.

నార:—ముమ్మాటికి నీకు సుముఖుడనే. నీవా ధర్మాభిలాషివి; ధర్మము నందే విజయము, భగవంతుడు. భగవచ్చింతనమేగదా నాజీవితపర మావధి! సర్వదా నేను నీపక్షమేనయ్యా! అదిగో ఆహూతులయిన వారరుదెంచు చున్నారు. కాలాతీత మగుచున్నది.

యయా:—చిత్తము. దయచేయుడు లోనికి.

(ఇరువురు నిష్క్రమింతురు తెర లేచును.)

(యయాతి రాజు కొలువు. ఆసీనులైన నారదాది మునులు, నిలుచుండిన యయాతి ప్రవేశము.)

యయాతి:—

ఉ. కోరినతోడనే యిచటకున్ దయచేసిన మీకు నా నమ
స్కారము లోపవిత్ర మునిసత్తములార! మహాత్ములార మహో
దారులు పూజనీయులు వదాన్యులు మీదగు పాదధూళి మా
వారిని నన్ను నాకొలువు పావనముం బొనరించె ధన్యుడన్.

మహాత్ములారా! ప్రఖ్యాతార్య విజ్ఞాన ప్రజ్ఞా ప్రభానిరస్త సమస్తార్యేతరాజ్ఞానాంధకార ప్రచండార్కులారా! స్వమతాభి జాత్యహంకారమగ్న ద్రావిడ కాంతార దావానలజ్వాలా కీలికలారా! దుర్భర దురంత దుష్టరాక్షసానీక మహావృక్షమూల విచ్ఛేదన దక్ష పవమానులారా! మీశక్తు లసామాన్యములు. మీగుణము లప్రమేయములు—మీ చేత లనుపమానములు—మీ రజేయులు.

చ. కలుషవిదూరమై, కరడుగట్టిన సాత్వికసాగరమ్ము లీ
యిల సృజియింపనైన, నశియింప శపింపగనైన జాలు ధీ
విలసితులెల్లవారు; నను ప్రేమను గాంచి జయప్రదంబుగా
వెలయగజేయ నీసభను వేడుచునుంటి సదస్యులందరిన్.

సప్తసముద్రము లాపోశనము పట్టిన అగస్త్యులవారు! బ్రహ్మ సృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్ర మునీంద్రులు! వారు వీరననేల? ఇట్లొక్కరొక్కరి గుణోల్లేఖనము గావించుట నాతరమా? శేషుని వశమా! అందరి కందరే ఘనులు. ఎల్లవారికి నాహృదయపూర్వక సాష్టాంగ

వందన సహస్రములు. ఇక పరిష్కృతము ఈసభకు ఇక్ష్వాకు కులగురువులు, బ్రహ్మజ్ఞానులు నగు వసిష్ఠమునీంద్రుల వారిని అధ్యక్షపీఠము నలంకరింపుడని—

విశ్వా:-ఏమంటివి? శ్రీరామగురు విందులేదనియా ఇక్ష్వాకుని వరకేగితివి?

యయా:-మిమ్ములను కాదనగలనా స్వామీ! కాని వసిష్ఠులవారుకూడ మునికుల గురువులు.

విశ్వా:-చాలునింక. అతడా మునికులగురువు? ఏమునులకు గురువేమి? అతని అగ్రాసనాధిపత్యమునకు మేమంగీకరింపము.

భర:-కౌశికా! అగ్రాసనాధిపత్య మొక్కరికేగాని ఇందరికెట్లు సాధ్యమగునోయీ!

అత్రి:-దూర్వాసుడు లేనిలోటు తీర్చుచుంటివే!

విశ్వా:-దురభిమాన బ్రాహ్మణ కులాగ్రేసరులారా! మీ జాత్యభిమానమునకు 'స్వస్తి' చెప్పుడు. బ్రాహ్మణాధిక్యము త్రోసిరాజను కాలము దాపురించినది. బ్రాహ్మణు నొక్కని పూజించి ఆభిజాత్యమును, అభిమానమును చంపుకొనుటకు వీడు క్షత్రియుడు.

అగ:-గాధినందనా! ఎందులకీ అహంకారము? అంత బ్రహ్మద్వేషివి బ్రాహ్మణత్వ మెందులకు స్వీకరించితివి? నీవధిరోహించిన శాఖనే ఛేదించుకొనుట యెంత అవివేకమో ఎరుంగవా?

విశ్వా:-బ్రాహ్మణ్యమునందలి లోపములు గ్రహించి బయట పెట్టుటకే బ్రహ్మజ్ఞానినైతిని నేను. అన్నియు నెఱుంగుదును.

గౌ:-అన్నియు నెఱుగుదువుకాని విశ్వామిత్రా! అందరును అందల మెక్క దలంచిన—

విశ్వా:-మోతగాండ్రు తక్కువగుదురనియా! ఆవసిష్ఠు డెక్కిన అందలము మోయించుటకా ఈనృపాధముడు మనల నందరను రప్పించినది? అంతగా మోతగాండ్రు తక్కువైన మీరును మీరును మోయుడు.

ఉ. భంగము పాలుగాగ మునివర్గము వానిని గొప్పజేయుచున్
బొంగుభుజాన వైచికొని మోయుడి మీరును మీరు; ఇంక యా
వెంగలి గద్దె నెక్కగ వివేకము చంపుక చిత్తమంచు మో
యంగ పనేమి మాకు? కలహాశన! లెమ్ము పనేమి యిచ్చటన్.

ఇల్లాలు వీధిపడ్డ యితడును పరులకు ధర్మప్రశ్నము లుపదేశించువాడే!

నార:-కొంచెము నిదానించుమోయి!

యయా:-మహాత్మా! శాంతింపుడు — నా మొగము చూచియైన—

విశ్వా:-నీముఖము! ఓ చూచితిని! ఓహో నీవును రాజువనియా? అప రాధము చేసినను స్వజాతివాడనని "నన్ను జూడు" మనుచున్నావు!

నార:-అట్టి అభిమానము మావిశ్వామిత్రునిపట్ల మందునకైన కానరాదు రాజేంద్రా!

విశ్వా:-ఉండదు — లేకున్న—

ఉ. మంచిని చెడ్డ నించుక విమర్శ యొనర్పక తోచినంత గా
వించుటయేన! ఏల పిలిపించితి మమ్ములఁ? ఈసభాస్థలిన్
క్రించుగ జూతువే! అతడు నీకు హితుండగునేని వాని ర
ప్పించి సభాధిపత్య మొకచేల కిరీటమె ధారపోయుమీ!

నార:-సదస్యులారా!

ఉ. కౌశికుడన్న మాటలకు గౌరవమీయ వచించుచుండె వా
గీశునిపట్టి యంచు నెపమెంచకయున్న వచింతునొండు; మా
నీశుల యోగ్యుడౌ నతని కెన్నికవెట్టి సభాధిపత్య సం
కాశుని చేయుటొప్పు నిది కాదన రెవ్వరుగూడ యీసభన్.

యయా:-చిత్త మట్లే కావింపుడు. మహాత్ములారా! ఈకుంభసంభవుల వారి అగ్రాసనాధిపత్య మంగీకరింపని మునిపుంగవులెవరైన నిందు గలరా! (ఎవరును మాట్లాడరు.)

విశ్వా:-ఎవరును లేరా! మీకులాభిమానమింత ఘోరమైనదా! కానిండు, రాజా! ఈనిర్ణయమును నేను తీవ్రముగా ప్రతిఘటించుచున్నాను.

యయా:-ఈకౌశికులవారి వాదనను బలపరచువా రెవ్వరైన నిం దున్నారా? (ఎవ్వరును మాట్లాడరు.)

విశ్వా:-నారదా! నారదా!

నార:-వసిష్ఠుని యగ్రాసనాధిపత్యము – నాకసమ్మతము – కాదు కాని కౌశికుని అధిపత్యమును నాకు సమ్మతమే!

యయా:-బ్రహ్మర్షీంద్రులవారి ప్రతిపాదనను బలపరుపనెంచు ధీమంతు లున్న వచింపుడు. (ఎవరును మాట్లాడరు).

అత్రి:-విశ్వామిత్రా! చూచితివా! ఎందుల కనవసర వాగ్వాదము. కూర్చుండుము.

అగస్త్యు:-మన బలాబలములు నిర్ణయింపబడినవిగదా! ఏల నాయారాభటము?

యయా:-మహాత్ములారా! రవంత శాంతింపుడు. విశ్వామిత్రర్షీంద్రా!

ఉ. కాదని వాదులాడుటకుగాని, వసిష్ఠులవారి మంచి మ
ర్యాదలు మీరెఱుంగనివె? బ్రహ్మకు మారుగ సృష్టిచేయు నే
నేదన చెల్లదాయనియె యెంతురు; మాకును బుద్ధిలేకపో
లేదు మహాత్మ! గర్వ్యమగు రీతిని కార్యము లాచరింపగా.

అనుగ్రహించి అంగీకరించిన ఉపాధ్యక్ష పీఠమును సమర్పించు చున్నాము. దయచేసి ఉపన్యసింపుడు.

విశ్వా:-ఏమంటివిరా దుర్మతీ!

మ. ననధిక్కారము చేయనెంచితివిరా! నాయంతరం బింతయుఁ
గనవా! నీవన నెంత! నీయొసగు సత్కారంబు లెక్కా! మద
మ్మున కర్ణగానక గాధినందను పరాభూతుం బొనర్పంగ జం
కును కొంకున్ వహింపవే తులువ నీకుఁ శాస్తికావింపనే.

యయా:-స్వామీ! శాంతింపుడు! క్షమింపుడు.

ఉ. మిమ్ము పరాభవించుటకు, మేమిటు పన్నితిమంచు, నింత క్రో
ధమ్మున, రాజమాత్రుని వృధాపరిహాసము పాలుచేయ ధ
ర్మమ్మె? కృపాంతరంగులయి, మా అపరాధము లున్న సైచి, శాం
తమ్ము వహింపరే! మునిజన స్తవనీయ! క్షమింపర్షే ప్రభో!

విశ్వా:-ఛీ! ఛీ!

గీ. చాలురా, రాజ! చండాల! సభకు బిల్చి
యిటు పరాభవముం జేయ నెంచినావు;
నీశిరము రాలకుండునే నేల మీద
నెల్లి భానుండు చరమాద్రి కేగులోన.

(నిష్క్రమించును.)

నార:-రాజేంద్రా!

మ. మునుగున్ గొంపలు; వెన్క ముందు గనకీ ముక్కోపి కోపానలం
బున కాజ్యంబును నీవ పోసితివి, రేపున్ మాపు నిశ్చింతగా
తిని కూర్చుండగలేక, నిన్నతడు సాధించున్ యథార్థంబు; ఆ
తని దుర్మార్గమె యింగ, వింతకును నీదౌర్భాగ్యమో భూపతీ!

యయా:—

ఉ. దోసమె యున్నదా తలను ద్రుంపగవచ్చు; అకారణంబుగా
మీసము దువ్వి, కుంభభవుమీది దురాగ్రహబుద్ధిచే రసా
భాసముసేసె సర్వమును; పైగ పరాభవమేమొ చేసిన
ట్లీసును గప్పు రోసమున ఏవిపరీతము తెచ్చిపెట్టునో!

నార:-ఇంక ఎవరేమి చేయగలరోయి! ఇప్పుడు విచారించిన ఏమి లాభము?

ఉ. చెప్పుచునుంటి నేనని మదిం దలపోసెదుగాని, యెంతగా
చెప్పితినయ్య అత డిటు సేయునటంచు, రవంతయైన నీ
వప్పుడు లెక్కచేసితివ? ఔ నెటుతోచును! మూడుపంక్తులన్
తప్పదు ముప్పు నీకని విధాత లిఖింపగ — భాగ్యహీనుడా!

గీ. విడువ డాతడు నీవెంత వేడుకొన్న;
నీతలను నీదు శీలమే నిలుపవలెను;
మానవోత్తము శీలమో; మానినాథు
పంతమో నెగ్గునది జూడవలయు నింక!

(నారదుడు నిష్క్రమించుచుండగా తెరపడును).

---

# శ్రీ రామాంజనేయము.
## తృతీయాంకము.

---

(ప్రదేశము:—శ్రీరాముని సభాస్థానము).

(ప్రవేశము:—శ్రీరామలక్ష్మణ భరత విశ్వామిత్రులు).

రామ:—ఆహా! బ్రహ్మతేజో విభ్రాజమాన మానవాతీత విఖ్యాత ప్రజ్ఞా ధురీణులు, వేదవేదాంతసార గంభీరసముద్రులు, పరమకళ్యాణ స్వరూపులు, పూజ్యపాదులు నగు గురువర్యులు వేంచేసి మాగృహము పావనము చేసిరి. (మోకరించును).

విశ్వా:—వాంఛాఫలసిద్ధిరస్తు.

రామ:—(లేచుచు)

ఉ. ధన్యుఁడనైతి నేను తమ దర్శన భాగ్యముచే; సతంబు సౌ
జన్యముతో నెసంగు తమ స్వాంత మదేలనో విన్నబోయె; ప
ర్జన్య గభీరగర్జనలు ప్రస్ఫుట మయ్యెను; ఏమురాత్మ దా
ర్జన్యము వాప నీపిడుగు రాలునో? ఎవ్వతె రేఖ జారునో?

విశ్వా:—రాఘవా!

ఉ. ఏమివచింతునో రఘుకులేశ్వర! ఇంతకు లేచినట్టి వే
ళామహిమంబు — నన్నొక యిలాపతి పిల్చి పరాభవించె —

గీ. ప్రతిన దాల్చితి ఛేదింప వాని శిరము;
స్వార్జితంబైన సాత్విక శక్తియెల్ల
అల హరిశ్చంద్రు సాధింప వ్యర్థమాయె;
ఎటుల చెల్లించుకొందునో యీప్రతిజ్ఞ? శ్రీ

రాముని దుష్టశిక్షణ పరాక్రమము, నిన్నును బోలు శిష్య చూ
డామణి యున్నవాని కిటులౌ తలవంపులు వచ్చె రాఘవా!

రామ:—

శా. ఎవఁడా ధూర్తుఁడు? పూజ్యపాదులగు మీరే తోచినారా? పరా
భవముం జేయగ నెంతసాహసము! ఎవ్వాడైన శిక్షార్హుడే
భవుడే కావగ నడ్డు వచ్చిన భవత్పాదాలపై ఎల్లి ఆ
రవి అస్తాద్రికి చేరులో నతని శీర్షంబు న్పడగొట్టనే!

విశ్వా:-వత్సా! సంతోషము. పితృవాక్య పరిపాలకుడవను ఖ్యాతిని మించి గురుభక్తి తత్పరుడవను కీర్తి గడింపుము.

లక్ష్మ:—

మ. దురితాత్ముండధికారగర్వమున అంధుండయ్యె—నెవ్వాండు, స
త్వరమే వానిని మామకీన నిశితప్రాచుర్య గాంభీర్య భీ
కర బాణాంబులచే జయించి, శిరమున్ ఖండించి నే దెచ్చెదన్
గురుదేవా! మిము చిన్నబుచ్చిన అభాగ్యుం డెవ్వడో తెల్పుడీ.

భర:-సోదరులారా!

చ. అలసితిరయ్య మీరలు సురారుల ద్రుంచి చతుర్దశాబ్దముల్
మెలగి యరణ్యభూములను; మేదిని నేలెడి నాకు నేటికీ
ఖలుని హతం బొనర్ప నవకాశ మొసంగు డినాన్వయంబులో
వెలసిన పేరు నిల్పికొని వీరుడ నేనను ఖ్యాతినొందగా.

రామ:-ఆచార్యవర్యా! మిమ్మవమానించిన ఆదురాత్ము డెవడో వచింపుడు. ప్రాయశ్చిత్తమొనరించి గురుదక్షిణగా తచ్ఛిరము భవదీయ పాదాబ్జములకు సమర్పింతును.

విశ్వా:-ఎవడా! కాశీపురాధిపతి — యయాతి.

రామ:-ఆతడా! అతడు విబుధవిధేయుడు, సజ్జనుడు, అని వింటినే!

విశ్వా:-ఆఁ, అగును. అది యొక నక్కవినయము. అతడు నీపాదభక్తుడట కూడ. అదియెల్ల కపటనాటకము. అది యొకవింత పయోముఖ విష కుంభము, గోముఖవ్యాఘ్రము! ఏమైననేమి? ఇది నీగురునాజ్ఞ. నీది ఆడి తప్పని రఘువంశము. ధర్మ నిర్వహణమునం దప్రతిమానులు నీవంశీయులు. వంశగౌరవమును విస్మృతిసేయక కార్యాచరణమునం దప్రమత్తుడవు గమ్ము (నిష్క్రమించును.)

(రాముడు విచారకలిత స్వాంతముతో నిటు సటు పచారుచేయు చుండగా నారదప్రవేశము).

నార:-రామా! ఏమిది! కళ్యాణప్రదమై కళావిలాసమోహనమై వెలుగొందు నీముఖబింబ మిట్లు నీలనీరద మాలికాచ్ఛాదనమై యున్న దేమయ్యా?

రామ:—నారదమునీంద్రా! సమయమునకే వేంచేసిరి. ఈసందిగ్ధ సమయమందు తగిన సలహా నొసంగి కర్తవ్య ముపదేశింపుడు.

నార:—నీకు నేను కర్తవ్యబోధకుడనా! అవతారపురుషుడవని ఆబాలగోపాలము శ్లాఘించు నీకు—నేను—కర్తవ్యము బోధించుట! చాలు! హాస్యమాడుటకు నేనా దొరకితిని.

రామ:—కాదు మునీంద్రా! విషయము వినిన మీరే యంగీకరింతు రిది విషమపరిస్థితి యని. అంతియేకాని రాము డెన్నడైన పెద్దల హేళన చేయుట వినియుంటిరా?

నార:—ఐన చెప్పుము. చెప్పినను వినుటకేగాని సవరించుట నాతరమా! వశమే యగుగాక? నేచెప్పినను నీవట్లు చేయుదువు కనుకనా?

రామ:—నారదా!

గీ. ఆశ్రి తాంకని వంశమం దవతరించి
　　బ్రోతు నాభక్తునిఁ గురుద్రోహి నగుచు?
　　శిష్టరక్షణ బిరుదంబు చేత దాల్చి
　　గురునకై భక్తు నొక్కని గూల్పవలెన?

నార:—ఆఁహాఁ! అయినదీ! అనుకొన్నంతయు ఐనది.

రామ:—ఏమైనది?

నార:—అనుకొన్నంతయు నైనది.

రామ:—ఏమది?

నార:—ఇదియొక విశ్వామిత్రమయ్యా! విశ్వామిత్రు లిందు వేంచేసియుండిరా? ఇకనేమి? అతిథిచే పామును చంపించినట్లు అయయాతిని నీచే చంపింపనున్నాడా ముని. అంతియేనా?

రామ:—తమకెట్లు తెలిసిన వీ వివరములు? తమరానాడు యయాతి కొల్వోవ కేగిరా?

నార:—మన మచ్చట లేకుండిన అదెంత రణరంగమయ్యెడిదో. అగును గాని ఇచ్చట నేమైనది?

రామః—నాటి కొలువులో గురువర్యులకు పరాభవమైనదటగా! గురు పరాభవమనినంతనే సహజమగు కోపోద్రేకముతో నేనాతని శిక్షింతునని ప్రతిన చేసితిని. గురువర్యు డాతని శిరచ్ఛేదము చేయింతునని ప్రతిన పట్టినాడట. రేపు సూర్యాస్తమయములో ఆరాజన్యుని శిరము గురుపాద కానుకగా సమర్పింతునని మాట యిచ్చినాను.

నారః—వివరమెరుంగకే మాటయిచ్చితివా? ఏమి విపరీతమయ్యా, అసలాతనిది తప్పో! ఒప్పో!—

రామః—అచ్చట నేమి జరిగినదేమి?

నారః—ఇదిగో వినుము.

సీ. నీపాదభక్తుండు, నీతిమంతుడు యోగ్యు
డత్యుత్తముండు యయాతిరాజు
వేదాంతగోష్ఠీ వినోదాభిలాషియై
కొల్వులో సభ వెట్టుకొనియె నాడు
విజ్ఞానధనులైన ప్రాజ్ఞులౌ మునులెల్ల
వేంచేసియుండి రా వేళ సభకు
అధ్యక్షులు వసిష్ఠు డామాట విని మండి
పడి కౌశికుడు గోలపడెను కొంత

ఆ. వె. ఆవసిష్ఠు మీది ఆగ్రహంబున గాధి
పట్టి రాజుపైన పగవహించె
ఒరుల గౌరవింప నోర్వంగలేని వా
డదె పరాభవం బటంచు గుందు.

మ. తన దర్బారున పెట్టుకొన్న సభ నధ్యక్షాసనంబున్ వసి
ష్ఠున కీయన్ దనకిమ్మటంచనగ నెట్టుల్ సాధ్యమా? అట్లె యి
చ్చినచో ఆతని చిన్నబుచ్చుటెకదా! చిక్కే తటస్థించు నె
వ్వాని గాదన్నను; ముందునిర్ణయమునే పాటించె నీభక్తుడున్.

ఆతని ఆత్మస్వాతంత్ర్యాభిలాష దోషమా? ఈతని నిరంకుశ నియంతృత్వము దోషమా?

రామ:-యయాతి వర్తనము సమంజసమే యని తోచినను గురువర్యుని యాగ్రహమునకును కారణము లేకపోలేదు.

నార:-చాలునోయీ నీయాచార్యాభిమానము. ఇది ఆత్మస్వాతంత్ర్య నిరంకుశాధికారముల మధ్య పోరాటము సాగుచున్న కాలము. ప్రజా రంజకుడగు రాముడు ప్రజాస్వామిక తత్త్వమును గాక నిరంకుశాధి కారమునే అభిమానించుచున్నాడే! సెబాస్!

రామ:-ఐన యయాతి దండనార్హుడు కాడనియా మీ యభిప్రాయము?

నార:-నా యభిప్రాయములతో నీకేమి నిమిత్తము? ఆడితప్పని రఘు వంశము నీది. ఆపైన ఆచార్యవర్యుని ఆజ్ఞ. ఇకనేమి? శరసంధానము గావించి భక్తుని శిరచ్ఛేదము చేసి——

రామ:-భక్తశేఖరునిపై బాణప్రయోగము సేయుటకు కొంచెము సంశ యముగనే యున్నది నారదా!

నార:-అయిన ఆయయాతినే బ్రతిమాలుకొని, విశ్వామిత్రుని కాళ్లు పట్టుకొని, పాదాభివందన మాచరింపుమనుము. సంశయముతో నెన్నడుగాని శరసంధానము చేసి యెరుగవు. అపజయగౌరవ మొం దుటకంటె గౌరవముగ గురుద్రోహము నొడిగట్టుకొని ఆడితప్పినను మంచిదే.

రామ:-ఎటులైన యయాతిని రక్షించుటే మీయభిమతము. ఇంతియేనా?

నార:-గురుద్రోహచింత నీకు లేకుండ యుండిన — అదియును బాధా కరమే.

రామ:-ఐన మీ నిర్ణయమేమి?

నార:-ఏమి చెప్పుదును!

గీ. ప్రతిన చెల్లించుకొనుటకై భక్తవరుని
ద్రుంచిన న్మంచిదే! గురుద్రోహ సంశ
యమ్ము లే కాడిబొంకి ఆ అనపరాధి
ప్రాణముల గాచిన న్మేలె రామచంద్ర!

రామ:-మీనిర్ణయ మిదమిద్ధమని తేలకున్నదే!

నార:-విషయ మట్టిదియైనది. నాప్రతిజ్ఞ దానికి సరిపోయినది. అనపరాధియగు నొక భక్తుని శిక్షించుటకు ప్రయత్నించిన ఏమరాక్క విషమ సంకటము తటస్థించునో - అసత్యమున కొడిగట్టుటయును మంచి పనికాదు. ఒక్క భక్తునికై ఇంత ముందువెనుక లాడిననాడు హరిశ్చంద్రునిమాట - రాజ్యము, సంసారము, భోగభాగ్యములు కడకు వంశాంకురమును సైతము సత్యమునకు బలిపెట్టెనే! నేను భక్తి సత్యముల మధ్య పోరాటము. ఏది గొప్పదో - భక్తియందే నా కనురక్తి.

రామ:-నాభక్తుడు ఎప్పుడును నావాడే! నా ఆత్మగౌరవమునకు అసువులనైన హోయిగ నర్పించి మోక్షసామ్రాజ్య మేలుటకు సంసిద్ధుడగును. అస్మదాదులకు సత్యమే అపేక్షనీయము.

నార:-పొరబడుచుంటివేమో సుమా రామచంద్రా! మీద నేమి పుట్టి మునుగునో కొంచెము భక్తితత్త్వము నెరింగినవాడను గాన నింత దూరము చెప్పుచుంటిని. దూరాలోచన చేసినపిదపగాని కార్యరంగమున కాలు మోపకుము.

రామ:-దూరాలోచన చేసియే నిశ్చయించుచుంటిని. అన్యాలోచన దూరాలోచనగాక దురాలోచనయే యగును.

(ఇరువురును చెరియొకవైపు నిష్క్రమించుచుండగా తెరపడును).



# శ్రీ రామాంజనేయము.

## చతుర్థాంకము.

---

(ప్రదేశము:—యయాతిరాజు పూజామందిరము).

(ప్రవేశము:—శ్రీరామ ధ్యాననిమగ్నుడగు యయాతి).

యయా:—రామా! పరంధామా!

చ. రామ! జయాభిరామ! రణరంగ పరాక్రమభీమ! హేపరం
ధామ! నిరంతరాశ్రిత జనావనసీమ! పవిత్రనామ! శ్రీ
రామ! గుణాభిరామ! రఘురామ! జగన్నుత దివ్యధీగుణ
స్తోమ! రవంత నాపయిన జూపవె నీ కరుణప్రభావముల్.

నార:—(ప్రవేశించి) రామనామస్మరణ గావించుచుంటివా? రాజేంద్ర! మంచిదే, భక్షింపనెంచిన వారినే ప్రార్థించిన కొంతదయగల్గి బాధ కలుగనీయక, నమలకుండ మ్రింగిమైన తోడ్పడగలరు.

యయా:—నారాముడు నన్ను భక్షించునా? ఆమహాత్ముల శరమున కంత క్షుద్బాధ కలిగిననాడీయల్పుడు తన తనువును పావనము చేసికొను టకు చక్కని మార్గమేకదా! నిష్కారణముగ విశ్వామిత్ర కోపా నల కీలికల దగ్ధమగుటకంటె చల్లని శ్రీరామబాణముల కెరయగు టయే మేలుకదా! ఏల నాపై రాముని కంతటి ప్రేమ కల్గినదో!

నార:—పిచ్చివాడా! ప్రేమకాదాగ్రహమది. విశ్వామిత్రుడు పట్టిన పంతము తీర్చుటకు రాముడు నిన్ను వధింప నున్నాడు. న్యాయా న్యాయ విచక్షణలేక గురుని ఆటకు హంగుదారు డగుచున్నాడు. ఇంకను రాముడు,—భక్తి—

యయా:—శ్రీరాము డింతవరకు నిజభక్తుని శత్రువునైన వధింపలేదె! గురునియందలి అభిమాన మింత చేసెనేమో కాని లోకాపవాదము— కానిండు. నాప్రభువునకు లోకాపవాదము కలుగకుండునట్లు నేనే ఆత్మహత్య చేసికొందును మునీంద్రా!

శా. చావుం బుట్టువు నెల్ల మానవులకున్ సాజంబె, లోకంబులో
జీవుల్ పుట్టినతోడనే మృతిని శాసించెన్ పరబ్రహ్మ; నా
దేవుం డారఘురాము డీతలను ఛేదింపంగ యత్నించి యే
లా విచ్చేయగ? త్యజింతు నే నె యసువుల్ ప్రాయోపవేశంబుతో.

నార:_క్రమముగ పిచ్చికూడ యెత్తుచున్నట్లున్న దే? ఇంత సాత్వికుడవు రాజువై ఎట్లు పుట్టితివి? చచ్చి ఎవరిని సాధింతువు?

యయా:_అంతకు మించి గత్యంతరము? రాముడు ప్రతిన చెల్లించుకొనక మానడు. రామబాణమున కెదురులేదు. నాప్రభువునకు నేనేల శ్రమ కలిగింపవలెను? నేనే ప్రాయోపవేశ మొనరించిన—

నార:_నీవు ప్రాయోపవేశ మొనరించిన ఆరాముని శపథము చెల్లునా?

యయా:_చెల్లదా మరి!

నార:_ఆతడు నీశిరచ్ఛేదము చేయ ప్రతిన గావించియున్నాడుకదా. నీవు ప్రాయోపవేశమునకు దిగిన ఆతని ప్రతిన చెల్లుట కవకాశ మేది? ఇంతకును నీకు జీవితాశ లేకపోవుటకు హేతువు?

యయా:_జీవితాశ లేనివాడెవడు నారదా! జీవితాశ లేక కాదు.

నార:_మరి జీవించుమార్గము లేకనా?

యయా:_అంతే మరి!

నార:_నేచెప్పినట్లు చేసిన నీజీవితమున కెట్టి అంతరాయమును కలుగదు. కాని నీవు నాపలుకు లాలింపవేమో యని సందేహము.

యయా:_జీవితమార్గమును జూపు మిమ్ములనే విశ్వసింపనను సందేహ మేల కలిగెను స్వామీ! అయినను నాజీవితమును రక్షించుకొను మార్గ మేమున్నది స్వామీ!

నార:_ఉన్నది. అదిగో అప్పుడే మార్గమును శంకించుచున్నావు. ఈ విశాలప్రపంచమున నిన్ను కాపాడగలవారే లేకుందురా!

యయా:_అదియే సందేహము. దేవుడే పగపట్టినపుడు ఇంకనూ నన్ను కాపాడగలవారీ ప్రపంచమున నుందురా?

నార:_వెఱ్ఱివాడా! ఈ యనంత ప్రకృతిలో నిన్ను కాపాడగలవాడే లేకుండునా! ప్రయత్నింపవలెనే గాని అసాధ్యమగు విషయమే

దోయీ మానవునకు? ప్రకృతము నాదృష్టిలో నిన్ను రక్షించగల బలోపేతుడును, దయాళువును ఒక్కడే ఒక్కడు తోచుచున్నాడు.

యయా:-ఎవరాతడు! అంతటి శక్తిసంపన్నుడా!

నార:-ఆత డనంత శక్తిసంపన్నుడు. కరుణామృతమయమూర్తి. ఆతని కొక్కనికే సాధ్యమగును నిన్ను రక్షించుట. ఆత డెవరందువా?

సీ. శతయోజన విశాలజలధిని లంఘించి వచ్చె రెండుదినాల వ్యవధిలోన;
దశకంఠు సేనలో దాదాపు సగమైన కాజేసి లంకనే కాల్చినాడు;
సౌమిత్రి మూర్ఛిల్ల సంజీవి నొకరాత్రిలో దెచ్చి జీవములోసినాడు;
రామలక్ష్మణుల మైరావణు మాయలోనుండి కాపాడె తానొక్కరాత్రి

రామరావణ యుద్ధాన లక్షలాది
ఘోరరాక్షసులకు బలిగొన్న ఘనుడు;
అట్టి అసహాయసూరుడౌ ఆంజనేయు
డొక్కడే నిన్ను కాపాడ నోపువాడు.

యయా:-ఆ! ఆంజనేయుడా స్వామీ!

నార:-అవును! ఏమా నివ్వెరపాటు! ఎందులకా యాశ్చర్యము!

యయా:-మహాత్మా! నన్నాతడు రక్షించునా భక్షించునా? విూరిచ్చు సలహా న్నాయుద్ధతికా? అధోగతికా? స్వామీ! భక్తపరాయణుడగు ఆంజనేయుడు శ్రీరామభక్తుడు కాడా!

నార:-ఐన నీవు శ్రీరామభక్తుడవు కావా?

యయా:-కాకేమి? ప్రభుని దయారసమునకు వెలియైన ఆతని పాద భక్తుడనే. ఆతడు మాత్రము శ్రీరాముని ఆదరాభిమానములు గడించిన భక్తశేఖరుడు.

నార:-గీ. ఎంతగా రాము గొల్చి సేవించినావు
పడగ విప్పిన దాభక్తి పాపమేమొ!
కాటు వేయకముందె జాగ్రత వహించి
అంజనీసూతి వేడుమయ్యా నరేంద్ర!

నీవా రామునంతగా ఆరాధించితివా! దానికి ఫలితము సున్న. కాదు కాదు. ప్రాణార్పణము. అంతగాకున్న ఏకాంతమైన నీ వాంజనేయు

నారాధింతువా ఆరాధించువరకేల! ఆరాధించునటుల నటింతువా? నీప్రాణములు నిల్చినవన్నమాటే.

యయా:- స్వామీ! ప్రభుభక్తి పరాయణుడగు అంజనేయుడు నన్ను కాపాడునా! తన స్వామి వధింపనున్న నన్ను తనస్వామివర కెందుల కని తాను వధింపక విడుచునా?

నార:- వెఱ్ఱివాడా! కొంత లౌక్యములేకున్న లోకములో బ్రతుకు సాగుటయే దుర్లభమోయి! "నన్ను రాముడు వధింపనున్నాడు. నీవు నాకు శరణ్యము కమ్ము"ని వేడుకొందువా యేమి? అమాయకుడా! ముందాత్రములో శరణువేడి అతడభయ మిచ్చిన వెనుక విషయము తెల్పిన యేచిక్కును ఉండదు. అగునోయి! చక్కని ఉపాయము తోచినది. తొలుదొల్త అతని జననియగు అంజనీదేవిని శరణువేడి, అభయము వడసిన మాతృనాజ్ఞ పాలకుడగు ఆతడును పాలించితీరును లెమ్ము. నేనును నీవెంటనే వచ్చి, దర్శకత్వము జేసెదను రమ్ము. (ఇద్దరును ఎదరకురాగా తెరపడును).

ఇదిగో! ఇదే గంధమాదనపర్వతము; అల్లదే ఆంజనేయుని గుహ; నీవు చితిం బేర్చుకొని, "దీనుల గాంచువారులేరా, లేరా" అని వాపోవుచు అందు పడిపోవుట కుద్యుక్తుడవై యుండువానివలె నటింపుము. కొంపదీసి నిజముగ బడెదవుసుమా! ఈశ్రమయంతయు వృథ. మరి రమ్ము. నేనీదాపుననే యుండి అవసరమైనపుడు మాత్రము ప్రవేశింతును.

(ఇరువురును నిష్క్రమింతురు) (తెరలేచును).

---

# శ్రీ రామాంజనేయము.

## పంచమాంకము.

---

(ప్రదేశము:—గంధమాదనపర్వతముపై మారుతి నివసించు గుహాసమీపపు స్థలము—ప్రవేశము:—చితివద్ద, విషాదకలిత స్వాంతముతో యయాతి).

యయా:—శ్రీరామా! భక్తజనపారిజాతా! నీకృపాలేశమైన యీనీ పాదభక్తునిపై లేకపోయినదా! నాకీలోకమున జీవదానము చేయు మహామహులే లేరా?

కం. లేరే దీనులగాచెడి, ధీరులు; బలహీనులకును దిక్కే—లేదా!
క్రూరాత్ముల దుర్మార్గము, వారించి శరణ్యమొసగు వారే లేరా?

అంజని:—(ప్రవేశించి) ఏమది? ఆత్మహత్యయా?

గీ. ఓయి ఆపన్నుడా! భయంబుడుగుమోయి!
నీకు గల్గిన భయమేమి? నీచరిత్ర
మిటు విషాందాంతమగుటకు హేతువేమి?
అభయమిడుచుంటి తెల్పుమయ్యా నరేంద్ర!

యయా:—అమ్మా నన్నేలవారించెదవు? నాపైన భగవంతునికే జాలిలేదు.

అంజని:—ఆర్యా, భగవంతుడు నీవనుకొనినంతటి నిర్దయుడుకాడు. భక్తుడవయ్యును అతని నేల శంకించుచుంటివో? శంకించుటచేతనే నిరాశాపూరితుడ వగుచున్నావు. ఆనిరాశయే నీసంశయమును పెంచుచున్నది. దీనికి పర్యవసానమే కాన్పింపదు. కావున సర్వభారమును భగవంతునిపై వేసి మా గుహయందు నిశ్చింతగా కూర్చుండుము. నీకేమియు భయములేదు. ఇంతకును నీభయకారణమేమి?

యయా:—తల్లీ! చెప్పి ఏమి ప్రయోజనము? అడుదానవు నీవు.

అంజని:—అయ్యా, నీకాసందేహము కలుగనక్కరలేదు. ఆడుది ఏమి చేయగలదని సంశయించుచుంటివేమో? లోకోత్తర వీరశేఖరుడగు వీరాంజనేయుని కుమారునిగ గన్న వీరమాత యీ అంజని. అంజ

నేయుడును మాతృనాజ్ఞాపరిపాలకులలో ప్రథమగణ్యుడు. సంశయింపక నీ భయహేతువును వివరింపుము. అభయప్రదానము చేసితినిగదా?

యయా:–జననీ! నీవింత నిర్బంధించిన నెట్లు చెప్పకుండగలను? ఇట్టి పట్టుబట్టిన నీవే భయకారణము తెలిసిన పిదప చింతింతువేమో?

అంజని:–అట్టి అగత్యమేల కలుగును? నీవేమైన అపరాధివా?

యయా:–అపరాధినో! కానో? విషయము తెలిసినపిదప నీకే విశదము కాగలదు.

అంజని:–అపరాధివే యగుదువుగాక. పశ్చాత్తాపరేఖ తోచినది గాన నిర్దోషివే. నీకభయప్రదానము చేసినవెనుక దోషాదోష విచారణము చేయుటయు పాడిగాదు. అడితప్పని శ్రీరామచంద్రుని ఆశ్రయించి పునీతమైన జాతి మాది.

నారః–(ప్రవేశించి) నారాయణ! ఆ శ్రీరామచంద్రుడే యీ యభాగ్యుని ప్రాణములు తీయ ప్రతిజ్ఞపట్టిన సత్యశీలుడు.

అంజని:–ఆఁ, నారదా! ఎంతపని చేసితివి? స్త్రీనొక్క తెను వంచించి శ్రీరాముని ప్రత్యర్థినిగా నిల్పుచుంటివే? ఎంతఘోరము!

నారః–ఇందు ఘోరమేమున్నదమ్మా?

ఉ. లేదితగాని తప్పు లవలేశము, రాముని లోపమేనియుఁ
లేదు రవంత, ప్రస్తుతపు క్లిష్టపరిస్థితికేని లేకపో
లేదొక హేతు–వేమైన జేనిని గాచుట ధర్మ మట్టి మ
ర్యాద విధాత నీనొసట వ్రాసె ముదంపడుమమ్మ అంజనీ!

అంజని:–నారదా! నాకుమారుని భుజబలము చూచుకొని నేనీతనిని రక్షింపగలననుకొంటినే! ఆత్మస్వామియగు రామదేవునిపై కత్తిగట్టు నీ దురుద్యోగమునకు మామారుతి అంగీకరించునా? అంగీకరించి, నిలిచి జయించునా! ఎట్టి బెడద చుట్టబెట్టితివయ్యా స్వామీ!

నారః–అత డంగీకరించినచో తప్పక జయింపగలడు. అంగీకరింపజేయుట నీవంతు. విజయము సాధించుట నావంతు. ఆతని శక్తి సామర్థ్యము

లనుపమానములు. నీ వెరింగియు శంకించుచున్నావు. అత డసామాన్యబలోపేతుడు.

గీ. లంక కాల్చెను; దనుజవర్గంబు గూల్చె;
సాధ్విశోకంబు దీర్చె లక్ష్మణుని గాచె;
అంతవానికి నీపని యెంతపాటి
తారకబలంబుగల మహాధీరు డతడు.

అతని జననకాలమునందే సూర్యమండలమున దేవతలందరు తమ తమ యస్త్రముల కాతడు అతీతుడగునట్లు వరము ననుగ్రహించిరి. అతడు మహాశక్తి సంపన్నుడు. శ్రీరామచంద్రుడు కూడ చిరంజీవి కమ్మని ఆశీర్వదించినాడు. ఇప్పుడన్యథా జరగగలదా! నీకుమారుడు దక్క ప్రకృత మీదీనుని గాపాడగలధీరు డీపదునాల్గు భువనములను లేడు. ఈవిషయమున నడుము బిగించి నిల్చిన నీకుమారుని ప్రతిభయు గీటుపెట్టబడగలదు. ఈతనిని రక్షించినట్లును అగును. ఇది ఉభయ తారకమగు చక్కని సన్నివేశము.

అంజని:—స్వామీ! నిజమే కావచ్చును. కాని అతడు జీవస్వామిగా నెంచు సీతాపతితో ప్రత్యర్థిగా నిలువుమని ఆదేశించుటకు నాకుమాత్రము నోరెట్లు వచ్చునయ్యా!

నార:—ఆ విషయమేమియు నీవెత్తనక్కరయేలేదు. అది నీకు తెలియనట్లే యుండవచ్చును. నీకుమారుడు కందమూలఫలాదులు తీసికొని వచ్చుసరికి కొంచెము విచారము నటింపుచు కూర్చుండుము. ఆమాత్రము చేయలేవా? విన్నబోయినట్లు కూర్చుండనైనలేవా? అప్పు డాతడే విచారకారణ మారయగలడు. వెంటనే "భయార్తుడగు నొకదీనునికి శరణిచ్చితిని; ఎట్లు చెల్లించుకొందునా యని ఆలోచన" అని యనుము. మాతృదేవి వగు నీబాధ్యతను మాతృభక్తి పరాయణుడు గావున నతడు వహింపగలడు. అప్పు డవసరము వెంబడిని ప్రవేశించి నేను పారథ్యముచేసెదను. ఇది సత్కార్యము. అతడు సమర్థుడు. మీకు జయము తథ్యము. అదిగో అతడు వచ్చుచున్నాడు.

మరి నేనీచాటున కేగెదను. మరి నీప్రయత్నమున నుంతుము. రాజా! నీవాదెస గూర్చుండుము. (నిష్క్రమించును.)

ఆంజనేయుడు:-(రామనామసంకీర్తనముతో ప్రవేశించి తల్లికి పాదపూజ కావించి)

చ. జననియు జన్మభూమియును స్వర్గముకన్న ఘనమ్ము; లందులో
జననికె వచ్చుగా మొదటి స్థానము; తల్లి ఋణంబు దీర్పజా
లిన మొనగాడు పుట్టడు ధరిత్రిని, పుట్టగలేదు; సర్వదా
జనని పదాలసేవయె ప్రసాదముచేయుమ జానకీధవా!

(తల్లి మొగమువైపు జూచి) అమ్మా! ఏమట్లుంటివి? విషాదకలిత స్వాంతముతో ఏమాలోచించుచుంటివమ్మా? నీ విన్నబాటునకు కారణభూతుడగు అభాగ్యుడెవ డీప్రపంచమున!

అంజని:-నాయనా! నీవంటి వీరకుమారునిగన్న మాతృదేవికి విచార మెట్లు గలుగునయ్యా?

ఆంజనే:-ధన్యుడను తల్లీ! ప్రతిదినమువలెగాక ప్రసన్నతజూపక ఏదియో దీర్ఘముగా నాలోచించుచున్నట్లుంటివే? నే నెరుంగకూడదా?

అంజని:-నీకు తెలియకుండిన నెట్లయ్యా? నేను నేనొక అసాధ్యము తెచ్చుకొంటినయ్యా?

ఆంజ:-ఏమది తల్లీ!

అంజని:-కుడిచి కూర్చుండలేక స్త్రీజన సహజమగు వాత్సల్యముచే నే నొక గురుతరమగు బాధ్యత కోరి వహించితిని. సామర్థ్యము లేదను సంశయము ఆసమయమున లేశమాత్రమును లేకపోయినది. ఈపరి స్థితి నెట్లీదగలనా యని ఆలోచించుచుంటినేగాని నిన్ను గన్న తల్లికి విషాదమా?

ఆంజనే:-అమ్మా! నీబాధ్యతానిర్వహణమున కృతార్థుడనై మాతృఋణ మును గొంత దీర్చుకొనుటకు నన్నాశీర్వదించి ఆజ్ఞాపింపుమమ్మా! నీకుమారునియం దామాత్రము విశ్వాసము లేదా! నేనందు తీర్చు

డనుకాలేనా? నీయాశీర్వాదబలములేదా? రామచంద్రుని ఆశీర్వాద బలములేదా? ఆజ్ఞాపింపుమమ్మా తల్లీ!

అంజని:- కుమారా! నీకోర్కె సిద్ధించుగాక!

ఆంజనే:- ధన్యుడను తల్లీ! ప్రభుభక్తి పరాయణుడగు ఆంజనేయుడు మాతృ నాజ్ఞాపరిపాలకుడు గూడ అను కీర్తిబొందుట కవకాశమిచ్చితివి తల్లీ! ధన్యుడను (పరికించిచూచి) విన్నబోయిన ఆమహాశయు డెవరమ్మా!

అంజని:- నాయనా! ఈతనిని గూర్చియే నేచెప్పవలసియున్నది. ఈతడొక భయార్తుడు. శరణార్థి. ఈతనికి నీవు ప్రాణదానము చేయవలెను.

యయా:- మహానుభావా! దీనశరణ్యా! లోకైకవీరప్రతాపా! వీరాంజనేయా! శరణు! శరణు!

ఆంజనేయుడు :—

గీ. అభయ మిచ్చితి నాప్రాణ మడ్డమైన
నీదు ప్రాణాలు రక్షింతు నిశ్చయమ్ము
అమ్మ నీయాజ్ఞ! నెరవేర్ప నసువులేని
పణముపెట్టెదనమ్మ నీపాదమాన.

నార:- (ప్రవేశించి) నారాయణ! నారాయణ! ఎంతఘోరము!

ఉ. ఇంతకు పూర్వమే యిరికి రిద్దరు వ్యక్తులు రామరామ! లో
తెంతో ఎరుంగకే అభయమిచ్చితి, మూడవవాడవీవు, సం
దింతయు లేదు తప్పకొన నెవ్వరికిన్, గురునాజ్ఞమీదుగా
పంతముబట్టె రాఘవుడు పార్థివు ద్రుంపగ పావనాత్మజా!

ఆంజ:- ఏమంటివి స్వామీ? ఈతనిని నాప్రభువు చంపబూనుటా? నేను రక్షింప ప్రయత్నించుటా? ఇది వాస్తవమా? పరిహాసమా?

నార:- పరిహాసమా? ప్రాణములపైకి వచ్చినప్పుడుగూడ పరిహాసమా?

ఆంజ:- పరిహాసమే కాకున్న నింత వైపరీత్యమా? ఆమహామహుని ప్రయత్నమును అత్యల్పుడనగు నేనా నిరోధింపబూనుట!

నార:-నీశక్తిని నీవెప్పుడును ఇట్లే శంకించెదవు. అతనియంతవాడతడు; నీయంతవాడవు నీవు. ఇందొకరితో నొకరికి సామ్యమేమి? మీ యిర్వురి బలాబలములు నిర్ణయించుటకే ఈశ్వరుడీ సంఘటనను కల్పించెను కాబోలును.

ఆంజనే:-ఇది ఈశ్వర సంకల్పమా! నాగ్రహచారమా! నాస్వామి కాగ్రహ కారణమగు మహాపాపము నీతడేల చేయవలెను? ఆ పాపఫలము నాతలకేల చుట్టుకొనవలెను?

నార:-ఆతడు చేసినది మహాపాపమో కాదో; విచారింపకనే తొందర పడనేల? అగును. రామాశ్రయ మాపాటి తొందరపాటైన నేర్పు లేదా? ఆసేవాభాగ్యమిది. ఇక ప్రకృతము వినుము. ఈయన కాశీ రాజు. తన కొల్వులో వేదాంతగోష్ఠి నేర్పాటు చేసికొనినాడు. అగ్రాసనాధిపత్యము వసిష్ఠునకు. ఇక మీగురువునకు గురువుండనే- విశ్వామిత్రుడు-ఆధిపత్యము తనకీయలేదని మండిపడి ఈతని తల తీయింతుననినాడు. అది అతని తరము గాక తన శిష్యుడగు మీ గురువుచే చేయింపనున్నాడు.

ఆంజ:-ఎంతఘోరమిది?

అంజని:-అన్యాయమే పాపము.

నార:-ఇట్టి పరిస్థితిలో నీతని దురదృష్టమునకు హృదయమున్న నెవ్వడు జాలిపడడయ్యా? శక్తిలేని నేనే శక్తివంచనలేక యీతని విముక్తికై పాటుపడుచుంటినే! అట్టియెడ శక్తికలిగిన మీరెంత పాటు పడవలెను? నిజమునకు నీవు దక్క నీగురుని ఎదిరించి జయించు వారీ ముల్లోకముల లేరు.

ఆంజ:-గురుధిక్కారమా? స్వామిద్రోహమా? శ్రీరామ! శ్రీరామ!! శ్రీరామ!!!

నార:-శ్రీరామ! శ్రీరామ!! శ్రీరామ!!! ఏమి భక్తియయ్యా! ఎందులకు వచ్చిన భక్తి! దీనుల జూచి కన్నీరు గార్చని భక్తితత్వముల ప్రయోజనమేమి? దీనుల గాపాడుటకు దీక్ష వహింపనినాడు దీనావనుడగు

రామదాసువైనంత నేమాయెనేమి? రాముడుమాత్రము నిన్ను మెచ్చునా? వ్యక్తికి ద్రోహముచేసినను తత్వమునకు ద్రోహదము చేసిన వాడవగుదువుగా! ఈ దుర్మార్గమునే వారించవలెను. ఈ యభాగ్యుని రక్షింపవలెను.

ఆంజ:-నిజమేకాని, నాస్వామితోడనా నాకు విరోధము?

సీ. రామనామమును మకరందమ్ముగా గ్రోలి ఏరీతి నిపుడు నిందించగలనొ!
స్వామిసాన్నిధ్యమే స్వర్గమ్ముగా నెంచి ఏభాతి నిపు డెదిరింపగలనొ!
రాఘవు ధ్యానమే రక్షగా భావించి ఏలీల నిపు డేవగియింపగలనొ!
ప్రభుధర్మమునె నమ్మి భక్తితో సేవించిఏటు సేవకుడను నిర్జింపగలనొ!
అతనితో వైరము స్ఫురించినంత నాకు
కనులగట్టిన యట్లు-లక్ష్మణునిమూర్ఛ
నాటి-సీతావియోగంబునాటి-అతని
మూర్తి కాన్పించు ఎదిరించి పోరుటెట్లు!

నార:-అబ్బబ్బ!!

శా. చాలు న్నీవిటు లెంత చింతిలిన కాసంతైన లాభమ్ము లే
నేలే దింక-రఘూద్వహుం డిటకు రానేవచ్చు-అపైన ఏ
మాలోచింతువు? మాటదక్క- దభయంబా యిచ్చినా-వేల నే
దో లోవైనవుచింత? తేల్చుమిక-చావో రేవో-శీఘ్రంబుగా.

ఆంజ:-అయ్యో నారదా! భరింపలేని బాధయిది.

ఉ. జీవితమెల్ల అర్పణముచేసి తరింపగ వచ్చునంచు నే
సేవలు చేసి నాహృదయసీమను నిత్యము కొల్చుచున్న నా
దేవునితోడనా పగ? నుతించిన స్వామిని నిందసేయుటా!
జీవములుండగా రణము సేయగలండొకొ బిడ్డ తండ్రితో.

ఆంజని:-ఔరా! ఎంతపని చేసితివి నారదా!

గీ. తల్లి బిడ్డలకున్ మధ్య తగవుపెట్ట
వచ్చినాడవు; మా కులస్వామితోడ

పుత్రుడే రీతి ఎదిరించి పోరగలడో!
కొంటెనారద! మాకొంప గూల్చినావు.

నార:—ఈమా రిది బాగున్నది.

గీ. అభయ మిమ్మంటినా?—వెనుకాడవద్ద
టంచు వారించుచుంటినా?—అగును లెండు
ఎల్లవారల నిందల ఈశ్రీరాన
మోయగా నేనె లోకువై పోయినాను.

నాకెందులకు కాని గోల! ఏమయ్యా రాజా! ఆడితప్పని రాముడే కాని వాని శిష్యు డాంజనేయుడు కాదు. రాపోదము — శ్రీరామ విధేయా ఆంజనేయా! మాకు సెలవు. ఈతనిని రక్షించుట నీకు చేత గాదంటివిగా?

ఆంజ:——ఆఁ!

శా. ఫాలాక్షుండు మహోగ్రుడై నను వధింపన్ వచ్చినన్ నేడె రా
నీ—లోకమ్ములు క్రిందుమీదయిన గానీ—నేగురుద్రోహపుం
గీలాలమ్మున మున్గి పోయినను పోనీ—ఇంక నేమైన గా
నీ—రక్షించుట తప్పదీ నృపుని నాకే జీవితంబున్నచో!

నార:—భళి! ఇప్పుడు కదా వీరాంజనేయుడవు! రాజా! ఈమారు నీబ్రతుకు నిల్చినది. నిశ్చింతగా నుండవచ్చు.

యయా:—మహాత్ముల యనుగ్రహము.

నార:—పావనీ! ప్రకృత ప్రమాదమునుండి బయటపడుట కింక సావధానముగ నాలోచింపుము. నీవు నిరాకరింపకున్న నాసలహా కెప్పుడును అభ్యంతరము లేదు.

ఆంజ:—స్వామీ! ఈయయాతి రాజేంద్రుని నాప్రాణములుండగా విడుచుట కల్లయే కాని——

నార:—కానీ—ఇంకను ఎందులకీ హంసపాదు?

ఆంజ:—మహాత్మా!

ఉ. శ్రీరఘురామ నామమును చింతనచేయుచు కాదె నాడు నే
వారిధి దాటితిన్, దనుజవర్గము గూల్చితి, లంక గాల్చితిన్,
కూరిమి బోధచు నాగురునకున్ ప్రతికక్షిగ నిల్చి ఏవిధిన్
పోరగలాడనో; చెదరిపోయిన గుండెను చేతబట్టుకన్.

నార:_నిజమేకాని నాయుద్దేశమును కూడ వినుము.

శా. శ్రీరాముం డలనాడు నీకిడిన ఆశీర్వాదమున్ మించి నీ
వారాధించిన భక్తితత్పరతయే ఆరీతి నీకున్ జయ
శ్రీ రప్పించెను_రామతారకమె వాసిం గాంచునో రాముడే
పేరుం గాంచునో లోకులెల్లరకు చూపింపంగ వచ్చుం జుమీ.

నీ శ్రేయోభిలాషులను జాంబవం తాంగదాదులనుకూడ రప్పించి యోచింపుము. మానసిక బలమున అనగా ఏలాశ్యము చేతనైనను సరియే గట్టెక్కితిమా సరేసరి_లేనిచో భౌతిక బలప్రయోగమునకు కూడ వెనుకాడవలదు. మరి నేనేగి అచ్చట వారి పరిస్థితు లెట్లుండెనో గమనించి వచ్చెదను. నిశ్చింతగ నుండుము రాజా! హరి నారాయణ!

(నిష్క్రమించును.)

———

# శ్రీ రామాంజనేయము.

## షష్ఠాంకము.

---

(ప్రదేశము:—శ్రీరాముని అభ్యంతర మందిరము)
(ప్రవేశము-శ్రీరామలక్ష్మణులు)

రామ:—సోదరా! లక్ష్మణా!

మ. మనకుం దేశికుడంచుగాని, జనసామాన్యంబులో గాధినం
దను మరియాదనుగాని, కొంచెమైనన్ లక్షింపకే నొవ్వఁజే
సిన నేరమ్మున దండనార్హుడగు కాశీరాజు; నీవిప్పు డా
తని బంధించి యయోధ్య చేరవలె నిర్దాక్షిణ్య చిత్తంబుతో.

అధూర్తుని యుత్తమాంగము నాచార్యుని పాదపద్మములకు సమర్పించి గురు నాజ్ఞాపరిపాలకులము కావలయును.

లక్ష్మ:—అగ్రజా!

మ. భవదాజ్ఞాపరిపాలనారతుడనై బంధించి యాధూర్తునిన్
భవదీయాంఘ్రుల చెంతఁబెట్టెదను లిప్తన్ కాని, అన్నా! పరా
భవమా దేశికునంతవాని, కతడా భక్తుండు! ఈచిక్కు దా
టు విధంబే కనరాదు; బయటపడుటెట్లో సుంత యోచించిరే?

రామ:—ఆలోచించుట కేమున్నది? కర్తవ్యము నీవటకే నిశ్చయించుకొన్నాము కదా!

గీ. అన్నమాటను చెల్లించునట్టి కులము
మనది,—జరుగనున్నది సర్వమును లిఖించి
పెట్టెనా బ్రహ్మ—ఏమౌనో చిట్టచివర
కీవిచిత్రమౌ కథ! ఇవుడెంచనేల?

లక్ష్మ:—మరి నాకు సెలవొసంగుడు.

రామ:—మంచిది. అప్రమత్తుడవై యాతని బంధించి శీఘ్రగతిని మరలిరమ్ము.
(లక్ష్మణుడు నిష్క్రమించుచుండగా నారదుడు ప్రవేశించును.)

నార:—నారాయణ! నారాయణ!

శా. రా! రామానుజ! బాపనయ్యా •యెదురా! రావయ్యా! రావేలనో
శ్రీరామా ఒక మాట! కష్టపడి కాశీయాత్ర గావించి ఆ
దారింబట్టియె మళ్లి వచ్చును సుమిత్రాత్రినూతి; ఏమన్నచో
ఆ రాజిప్పుడు కాశికాపురిని లేడయ్యా యథార్థంబుగా.

లక్ష్మ:— అయిన నాతడిప్పు డెందున్నాడు?

నార:—ప్రాణభీతిచే నెవ్వరినైన నాశ్రయించి యుండవచ్చును.

లక్ష్మ:—అన్నగారిప్రతిజ్ఞానిర్వహణమునకు నిరోధకముగా అతని కాశ్రయ మీయనెంచు మదాంధుడగు బుద్ధిహీనుడెవడీ ప్రపంచమున?

నార:—సౌమిత్రీ! ఎల్లరును రాము నాజ్ఞాపరిపాలకులనియేనా నీయభిప్రాయము? లోకులందరును మనవలెనే యుందురా? ఈవిశాల ప్రపంచమున దీనుడగు యయాతికి శరణ్యమీయదగు బలోపేతుడు మన దృష్టియందు మదాంధుడే బుద్ధిహీనుడే యనుము—లేకుండునా?

రామ:—బ్రహ్మర్షీ! త్రిలోకసంచారివగు నీకు ఏతద్విషయము జ్ఞాతమైనట్లే తోచుచున్నదే! అఘూర్తునికి శరణ్యమిచ్చిన ఆతతాయి యెవ్వడు?

నార:—ఎవ్వడా?

ఆ. వె. ఆంజనేయవరద! ఆలించుమా కొంత
శ్రద్ధతో యయాతిరాజు గొడవ;
అతడు ప్రకృతంబు హనుమంతు శరణార్థి
చింత లేక అతని చెంత నుండె.

లక్ష్మ:—ఆఁ ఏమీ!

గీ. ఎంతవాడయ్యె హనుమంతు డింతపొగరు
పట్టెనా?—స్వామి వధియింప ప్రతిన దాల్చు
వానినే చేరనిచ్చెనా? వాని గావ
అతని శక్యమ? అతగాని అబ్బతరమ!

నార:—ఎవరితరమో? ఎవరితరముకాదో? కడకు చూచిన గాని ఇప్పుడేమి చెప్పగలము? కాని లక్ష్మణా! ఆశ్రయించిన వానికి విశ్వాసముం

డవచ్చునుగాని అశ్రియ మిచ్చెడువానికి స్వసామర్థ్య విషయమున కొంచెము సంశయముండ నక్కరలేదా!

గీ. వటబడి కొట్టుకొని పోయెడి అభాగ్యు
డడ్డమగు గడ్డి చేగొను నబ్బురంబె
గడ్డి పరకాతనిం గావగా ప్రయత్న
పడుట కొక్కింత ఆశ్చర్యపడగ వలదె?

రామః—మా మారుతి అతని కభయప్రదానము చేసెనా?

నారః—అగును. నిరంతర భవదీయ పాదారవింద మకరందాస్వాద నప్రమత్తుడు. ప్రకృతము నీప్రత్యర్థియెడ నప్రమత్తుడు.

రామః—ఆహా!

చ. ప్రాణభయాన-జీవితముపై గల తీపిని వీడలేక ఆ
దీనుడు వేడినంత వెనుదీయక రక్షణ నిచ్చె నా మరు
త్సూనుడు! రామదాసుడుగదోయి! అతండు దయాసముద్రుడై
దీనుల బ్రోచి మాదగు ప్రతిష్ఠను నిల్పగ వింతయున్నదా?

నారః—భేష్ భేష్ రామా! ఆత్మభక్తుని గుణసంకీర్తనమున ప్రతిజ్ఞా కర్తవ్యములనే విస్మరించుచున్నట్లున్నావే!

రామః—ఏమంటివి నారదా!

నారః—ఏమంటిని! ఆంజనేయునిమీద వాత్సల్యముచే విశ్వామిత్రుని పరాభవమును విస్మరించుచుంటివంటిని; యయాతిని విడుతువను కొంటిని; ఆంజనేయుని వలె నీవును గురుద్రోహమునకు గురికానెంచి తివేమో అనుకొంటిని.

రామః—ఏమి! నారదా, ఆంజనేయుడే కాదు.

గీ. ఆ త్రినేత్రుడే కావగ నడ్డుపడిన
ప్రతిన జెల్లించుకొను జుమ్మి రాఘవుండు;
ఆత్మభక్తునితో రణం బైనగాని
మాట దక్కించుకొనకుందుమా మునీంద్ర!

నారః—నీవు మాటదక్కించుకొందువను ధైర్యము లేకపోలేదు. కాని అతని ప్రవర్తనకే ఆశ్చర్యపడుచుంటిని. రామచంద్రా! నీవేమనుకొను

చుంటివో కాని ఆంజనేయుని ప్రకృత ప్రవర్తనము మావంటివారికి కొంచెము కష్టముగనే యున్నదయ్యా!

రామ:_ఆంజనేయుని తత్త్వ మర్థముకాక నీవట్లు భావించుచున్నావు. రామకార్యధురంధురు డాతడు. ప్రభుభక్తిపరాయణుడు. నిజస్వామి కొరకు ప్రాణములనైన విడుచుటకు సిద్ధపడు నాతడు యయాతిని మాత్ర మేల విడువకుండును?

నార:_అంతకాలము నిన్నాతడాశ్రయించినను, ఇంతమాత్రము నీవా తని తత్త్వము నర్థము చేసికొంటివి రాఘవేశ్వరా! ఆకాలమున నీకై ప్రాణములనైన నర్పింప సిద్ధపడెను. మరి యిపుడో ప్రాణములైన విడుచునుగాని యయాతిని విడువడు. ఆకాలము వేరు ఈకాలము వేరు.

గీ. కోతిగానికి నీవాక్కుచేత ఖ్యాతి
ప్రబలజేసితివో జయరామ నీవు
నేడతడు నిన్ను కాదని నిల్చుచుండె
కాలమహిమంబు వర్ణింపగా దరంబె!

రామ:_కాలములు మారినంత మాత్రమున భక్తుని తత్త్వము మారుననుకొంటివా నారదా?

గీ. మధ్యవర్తులమూలాన మాకు మధ్య
పొరపులేర్పడెగాని, వానరున కెపుడు
భక్తిపోలేదు; నాయందు రక్తిచెడదు
రాయబారాన తేలు సర్వంబుగూడ.

నార:_అతనియందు నీకీ వాత్సల్యముండుటయు మంచిదే. అతనికి నీయందు భక్తి నిలిచినను మేలే! ఏమైనను నీవనుకొనినంత సులభముగా ఆత డాతనిని విడువడని నాయూహ.

రామ:_కష్టసాధ్యమె యగుగాక! మాప్రతిజ్ఞాక్రమ మెరింగినంతనే పావని పశ్చాత్తాపపడి యయాతిని తప్పక విసర్జింపగలడు.

నార:_పొరబడుచుంటివి రామచంద్రా! అతనిది కోతిబుద్ధి. అత డంత సౌమ్యముగ యయాతిని వీడుననుకొనుచుంటివే!

ఉ. ఎంత అమాయకుండవో మహీస్థలి అందరి బుద్ధులెల్ల నీ
స్వాంతమువంటివంచు పొరబాటు పడందగదోయి; చూడవే
ఎంతటివాడో! నీయెడల ఎంతటి భక్తియొ నీయనుజ్ఞపై
ఎంతటి గౌరవంబొ ఇపుడే విశదంబగు నెల్లవారికిన్.

రామ:—నారదా! చూచెదముగా! రాయబారమంపి లక్ష్మణా! సత్వరము నీవు మన మారుతిని—నీవు కాదు. భరతునకు కబురు చేయుము. అతడిట్టి విషయములను చక్కగ సమర్థించి సంధి కుదర్చగల శాంత స్వభావుడు.

నార:—అగు నీతనిది రవంత చురుకుపాలు. ఎప్పుడో కావలసిన యుద్ధమిప్పుడే సిద్ధమగును. శాంతస్వభావుడును, సకలసద్గుణ భరితుడు నగు భరతునే పంపి, సాధ్యమగునంత సామముగనే కార్యసాధన చేయుట మంచిది. నాకు సెలవొసంగుము. త్వరలో దర్శనము చేసికొందును. హరినారాయణ!

రామ:—బ్రహ్మ మానసపుత్రా! శ్రమయనుకొనక మదీయ ప్రతిజ్ఞావిధానము మీబోంట్లుగూడ వాయుపుత్రునకు తెలియజేసి, సంధికి ప్రయత్నింపవలసినదని వేడుకొనుచున్నాను.

నార:—కార్యభంగమైనచో పిదప నన్ను నిందింపకున్న నభ్యంతరము లేదు. అసలే లోకులు నాకు 'కలహకారకుడ'ను బిరుద మొక్కటి ప్రసాదించియే యున్నారు.

రామ:—జరుగనున్నది సర్వమును ధాత లిఖించిపెట్టియే యున్నాడు. మనము కేవలము కారణమాత్రులమే. ఇందొకరి నొకరు నెపపెట్టనేల?

నార:—మరి సెలవు. హరినారాయణ!

(ఇరువురు చెరియొకవైపునకు నిష్క్రమించుచుండగ తెరపడును.)

---

# శ్రీ రామాంజనేయము.

## సప్తమాంకము.

---

(ప్రదేశము:—గంధమాదనాచల పరిసరము.)

(ప్రవేశము:—ఆంజనేయుడు జాంబవంతాంగదాది కపిదళము.)

ఆంజనే:—శ్రీరామ సేవాదురంధరులారా! కపికుల గౌరవాపేక్ష పరాయణులారా! ప్రస్తుత విషమపరిస్థితి పర్యాలోకించి స్వధర్మ నిర్వాహణమునందీ మీాఅభిమానపాత్రుడగు రామదాసునకు చేయూత నొసంగుడు. స్వామి ద్రోహమున కొడిగట్టి నేనీరాజన్యున కభయ ప్రదానము చేయలేదు. ఈతనికి శరణ్యమిచ్చుటకు కారణమును లేకపోలేదు.

మ. మహితాత్మున్ రఘురామునిన్ హృదయసామ్రాజ్యంబులో నిల్పుటల్
సహజంబా దయతో యయాతికి శరణ్యం బిచ్చినాడల్ ముదా
వహ చిత్తంబున—కాని—స్వామి నెదిరింపన్ బుద్ధియే పుట్ట దే
గ్రహచారంబొ మదీయ కర్మపరిపాకంబొ మరేమో కటా.

రామసేవాఫలితముగ సంప్రాప్తమైన దీనదయాళుత్వమే కారణము. అభయహస్త మిచ్చితిని. ఆపిదపగాని రామవైరమని తెల్లమైనది. కాదు. కావున,

గీ. సత్యమును గోరి మన కులస్వామి లెక్క—
సేయ కీ యభాగ్యుని గావ న్యాయమగున?
ప్రభువికొరకయి సత్యంబు బారద్రోలి
ఈ యయాతిని వీడుట న్యాయమగున?

అంగ:—స్వధర్మ నిర్వహణ ధౌరేయా! వీరాంజనేయా! ప్రకృత మీా దీనుని వీడిపుచ్చుట ఘోరాతిఘోరము. అంతకంటె పాపకార్యము వేరొండులేదు. మరియు,

మ. జయరాముండు జయాభిరాముడను విశ్వాసాన ధైర్యంబు నీ
రము, రక్షార్థిని కోతిగాండ్రు విడినారంచున్ జగంబెల్ల కో
డము కూయున్‌ మనమీ యయాతికి శరణ్యం బిచ్చియున్ వీడినన్
జయమో స్వర్గమో ఆరునూరయిన రక్షాధర్మ మే యర్థమౌ.

కావున మనజాతి యంతయు నిర్మూలమైనను మేలే కాని, ప్రత్యర్థి మహాబలవంతుడని, మన కులస్వామియని, అధర్మ మాచరింపకూడదని నాప్రార్థన.

ఆంజ:- మంచిది. అంగదకుమారా! బాగుగా నుడివితివి. తాతా! నీయభిప్రాయమేమి?

జాంబ:- శ్రీరామభక్తాగ్రగణ్యా! నామాటలు కొంచెము దూరమాలోచించినగాని రుచింపవు. కావున శ్రద్ధగా నాలింపుడు.

ఉ. స్వామి విరోధమంచు బలవంతుడు వైరియటంచు జంకి నే
డీ మనుజాధిపున్ విడువనెంచుట యుక్తముకాదు; పోని ర
క్షామతితో యయాతికొరకై ప్రభుభక్తిని నీటగల్పి శ్రీ
రాముని ధిక్కరించి సమరంబు ఘటింప నధర్మ మేయగున్.

ఇతనిని వీడుటయు న్యాయముకాదు. అతనితో పోరాడుటయు ధర్మముకాదు.

ఆంజ:- తాతా! యథార్థమగు ధర్మమును జెప్పితివి.

అంగ:- యథార్థమేకాని అసాధ్యము. భిన్నసమస్యల నెట్లు సంధానించి సమర్థింపగలము?

జాంబ:- అట్టివిధానమే ఆలోచింపవలెను. స్వామితో పోరాడుటకుగాని, శరణార్థిని విడుచుటకుగాని సిద్ధపడకూడదు.

అంగ:- బాగున్నది. మరి ఆలోచింపు డెట్లు సాధ్యమగునో?

జాంబ:- (పరికించిచూచి) భరతమహారాజు.

(అందరును లేచి నమస్కరింతురు.)

ఆంజ:- స్వామీ! తమర్లాక అయోధ్యనుండియేనా! ప్రభువు కుశలమా?

ఉ. క్షేమమె మీకు రాజకుల శేఖర! రండిట కూరుచుండు డే
మేమి విశేషముల్? రఘుకులేశ్వరు, సజ్జనరక్షకుండు మా
స్వామి ముఖస్థమై వెడలు చల్లని మాటల నాలకింపగా
మోములు వాచియుంటిమి-మముట్ తలపోయున? విస్మరించెనా!

భర:-రామకార్యధురంధరా! మరుత్కుమారా!

ఉ. ఎల్లరు సేమమే కపికులేశ్వర! ఎట్టుల విస్మరించు మీ
వల్ల విపత్సముద్రపు తుపాను తరించిన కష్టజీవి? తా
నెల్లపుడుట్ స్మరించును తనే తన భక్తులటన్న తత్వ మా
చల్లని రామచంద్రునిది; సాధువశంకరు డాత డెప్పుడుట్.

ఆంజ:-ఆమహానీయుని దట్టి యుత్తమతత్వమే! సాధుసజ్జన సంరక్షణ బిరుదాంకుడు, పతితోద్ధరణ కంకణుడు.

భర:-దుష్ట శిక్షణార్థమైకూడ కంకణము ధరించినవాడే! కోపించెనా! ఎంతటివారినైన తుదముట్టింపగల వీరశేఖరుడు, ప్రేమించెనా! ఎట్టి వారినైన ఉద్ధరింపగల అమృతమూర్తి!

ఆంజ:-నిజమే మహాత్మా! రావణవిభీషణులే అందులకు తార్కాణములు. రావణసంహారి! విభీషణశరణాగత-

భర:-ఆ! అట్టి శ్రీరాముడే ప్రకృత మొక మహాకార్యవిషయమున మీసాహాయ్య మభ్యర్థించి నన్నంపినాడు.

ఆంజ:-ఎట్టి మహాకార్యమిది స్వామీ!

భర:-మీరు సహాకరింప అంగీకరించినట్లైనా?

అంగ:-విషయము వినిన పిదప—

జాంబ:-ధర్మవిరుద్ధము కానిచో—

ఆంజ:-తప్పక అంగీకరింతుము.

భర:-రాము డెప్పుడైన ధర్మవిరుద్ధమైన ఆజ్ఞ చేసియుండెనా?

జాంబ:-స్వామీ! స్వధర్మము ముందు పరధర్మములు తృణప్రాయముల వలె తోచును.

అంగ:-విషయము తెలిపిన ఎట్టిదియో విశదము కాగలదుగదా!

భర:_విషయవిచారణ చేసికాని కర్తవ్యమునకు రాజాలరా? అన్నివిషయము లిట్లే చేయుచుండిరా?

అంజ:_ఆర్యా! ఆ అజ్ఞత చేతనే మేల్కొన వలసివచ్చినది. ఇంతకు పూర్వమే ఒక విషమఘాతమునకు గురియగుట చే విషయవిలోకనముపై నింత శ్రద్ధ పట్టించుకొనవలసివచ్చినది.

భర:_ఏవిషమఘాతమది?

అంజ:_ప్రమాదభరితమగువిషమఘాత మే!ఆవిషమపరిస్థితికి సంబంధింపని ఏవిషయమంౖదైన రామచంద్రుని ఆజ్ఞలకు బద్ధుల మే.

భర:_ఆపరిస్థితి యెట్టిదో వివరింపుము.

అంగ:_రామానుజా!

గీ. అభయమిడినా డితండు యయాతి యనెడు
కాశికాపట్టణం బేలు క్ష్మావిభునకు
అతని రాముడు వధియింప ప్రతిన దాల్చె
ననుచు తదుపరి విని దుఃఖమున మునింగె.

జాంబ:_అభయమిచ్చి విడువరాదుగదా! ప్రభునితో పోరాడుటయు దోసమేకదా! దీనికి మీసలహా నపేక్షించుచున్నాము.

భర:_ఈసందర్భముననే నేనును రామదూతనై అరుదెంచితిని. నా సలహా కోరతిరి కావున చెప్పుచున్నాను. రఘుదేవుని ఆనతి ప్రకారము ఆతనిని విడిచి—

అంగ:_అదియే ధర్మమందురా?

భర:_ధర్మమో అధర్మమో? అది గురుదేవుని ఆజ్ఞ. ధర్మాధర్మవిచక్షణ చేయక స్వామి ననుసరించుటమే రామదాసుల కర్తవ్యము. విధ్యుక్తధర్మము. ధర్మసందేహమే తోచినను తద్దోషము మిమ్మంటకుండ నుద్ధరించు బాధ్యత మీ మార్గదర్శియగు అతనిమీదనే యుండును కావున హనుమా!

మ. మన బంధమ్ము దలంచి శుద్ధమగు ప్రేమ స్నీవు సేవించి కొ
ల్చిన మూర్తిం దలపోసి, నిత్యమగు చెల్మిం దృష్టిలో నిల్పి ఓ
హనుమా! స్వామి మొగంబు జూచి విడుమయ్యా, నేడు నీవీ యయా
తిని; శ్రీరాముడు రాయబార మిటు పుత్తెంచెం శుభం బెంచుమా!

ఆంజ:—రామానుజా!

చ. విడిచిన రామచంద్రుని పవిత్రి పదాలను భక్తి గొల్చి, పే
ర్వడసిన సేవ మెచ్చువడు; పంతము వీడక యున్న రాముడే
గడపగలట్టివా డుభయగౌరవభంగముగానిరీతి; నే
విడిచి ప్రతిజ్ఞ వీడు టవివేకముకాదొకొ రాజశేఖరా!

భర:—పంతము వీడుటకు ఇష్టపడకున్న ప్రాణములు వీడుటకు సిద్ధముగా నుండిరా?

ఆంజ:—అట్టి ప్రాణభయమే వచ్చిననాడు తప్పునా స్వామీ!

ఉ. ప్రాణభయంబుచేత శరణార్థిని వీడితినన్న నిందతో
గాని చరింపలేనపుడు కార్యము ప్రాణము లొడ్డుటేకదా;
పోని—ప్రతిజ్ఞకై బ్రతుకు పోయిన పోవును గాక—రాము బా
ణానిలమందు భస్మమయి పోయిగ పొందెద పావనత్వముఁ.

మరియు స్వామీ! నేను ఏ అకార్యము చేసికాని శిక్షాపాత్రుడ నగుటలేదు. ఆత్మబలిదాన మొసంగుటకు కారణము సత్కార్యము కావుననే, అతడా!

చం. పతితుడుకాడు సజ్జనుడు, భక్తుడు, యోగ్యుడు, అట్లుగాక దు
ర్మతి యగుచో వధింపనె? రమారమణుం డరుదెంచునంత తీ
వ్రత కలిగింతునే? విజయరాముని సేవ పునీతమైన నా
మతి కలలోననైన అపమార్గము పట్టునె రాజశేఖరా!

భర:—మారుతీ! కొంత నిదానించుమోయి, మొదట రామవైరమని తెలియక నీవిచ్చిన అభయ మభయములో లెక్కకాదు. తెలిసియే యిచ్చినచో నీయుద్దేశ్యము సమంజసమైనదే, న్యాయమైనదే, దాశరథియే చెప్పినా డీధర్మసూక్ష్మము; అసత్యదోష మావంతయు లేదు.

ఆ. వె. తెలియ కభయమిడిన తెలిసినచో వీడు
ననుచు దలచి రాము డనిపె నన్ను;
అన్యు నొకని గూర్చి యన్యోన్యముగ నున్న
మీకు వైరమా సమీరతనయ!

ఆంజ:- భరతమహారాజా!

ఉ. వైరము గోరియే పొగరుబట్టిన ముక్కరబుద్ధితోడ సా
మీరి యయాతి కిట్లభయ మీయ దలంపగలేదు; దీనులౌ
వారిని గాచుచో నెదుటివారి బలాబలముల్ గణించి ఈ
బోరు శరణ్యులెందు గుణభూషణు లోరఘువంశభూషణా!

ఇక అసత్యముకూడ సత్యమని నన్ను హెచ్చరించుచున్నారు. అసత్యమునకు సత్యముకంటె నెక్కుడు గౌరవ మాపాదించుచున్నారు. ఇది మహాత్ములైన మీకు తగనిపని. పలికి బొంకుట మహాపాపమని లోకమునకు చాటిన మహానుభావులు మీవంశీయులు.

గీ. ఆడి తప్పుట అపరాధ మనియె గాదె-
కాలధర్మము నొందె మీకన్నతండ్రి
పదియు నాల్గేండ్లు వనముల బట్టె రాము-
డాడితప్పిననాడు రామాయణంబె
లేదు, మీవంశపు ప్రతిష్ఠ లేదు, మాకు
అన్నివిధముల గురువర్యులైన మీరు
పలికి బొంకాడు మనుటేటి పాడియయ్య
ఆడితప్పుటకంటె మే లాత్మహత్య.

భర:- ఆ ఆడితప్పుటకు శంకించియే శ్రీరాముడును ఇంత ప్రయత్నించుట. పలికి బొంకని వంశమం దవతరించుటచేతనే పలుకు పట్టింపునకు రాముడును నిలువక మానడు. సత్యాభిలాష మీకే యింత కలుగ మీమార్గదర్శికి లేకుండునా?

ఆంజ:- ఆప్రభుని అనుచరులమగుటచేతనే జయాపజయ విచారము లేక ధర్మావలంబుల మగుట.

భర:- రాముని శక్తిసామర్థ్యము లెరింగియు నింత మాధ్యము తగదు. ఘోరరాక్షససంహారి యతడు. అతని నిర్జించువా రీత్రిభువనములందును లేరు.

సీ. కౌశికు యాగమ్ము గాపాడ ఘోరరాక్షసుల బాల్యాననే కసిమసంగె;
ఖరదూషణాది ముఖ్యులవెనకు వేలుపంపించె నొకచేతిపైన దివికి;
ఏవీరుడన్నమీకెల్ల సింహస్వప్నమా వాలి(ని) మీముందె హతమొనర్చె;
అఖిలలోకస్థుల హడలించిన నియంత రావణాసురుని గీర్వాణమడచె;
గీ. ఆర్యవిజ్ఞానభాస్కరుండై, హిమాద్రి
మొదలు సింహళపర్యంతమున్ రహించె
రాముడన నేమొ అతని ప్రతిభ యేమొ
కొంత నీజ్ఞప్తియందుంచుకొనుమ హనుమ!

ఆంజ:—నాకా రాముని శక్తిసామర్థ్యములు బోధించుచుంటివి? రాజా! తెలియనివాడను కానయ్యా! అతడద్వితీయ వీరాగ్రేసరుడే కావున—

ఆ. వె. అంత గొప్పవాని హనుమంతు డెదిరించి
విజయ మొందెననెడి పేరొకండొ,
ఆమహాత్మ్ము కరములందు ప్రాణము వీడు
స్వర్గసుఖమొకండొ, వలయునయ్య!

భర:—నీ నుడివినవానిలో కడపటిదియే లభ్యము కాగలదు. అతని వచనమమోఘము, శరము బలాఢ్యము. శిష్యవాత్సల్యమున రాముడాహవమొనర్పడని ధైర్యమున్నదేమొ? అతడు నిన్ను నిర్జింపదండెత్తివచ్చుట తథ్యము.

ఆంజ:—మనఃపూర్వకముగా స్వాగత మిచ్చుచున్నాను.

ఉ. రాముఁ డొకండు కాదు, పదిలక్షలరాములె ఏకమైన, సం
గ్రామము చేసినన్, వినువరా దితగానిని నిశ్చయంబు, నా
స్వామి పదంబులాన విడువంజుమి దీనుని జీవముండగా,
నా మృతివెన్కగాని నరనాధుడు దక్కడు మీకు భూధవా!

ఇదియే నానిశ్చయము వేరొక ధర్మసూక్ష్మముకూడ కలదు. శ్రద్ధగా నాలింపుము రాజా!

ఉ. నీవు చిరాయు వొందుమని నిండు మనంబున నాడు నాకు తా
దీవెన లిచ్చె, నేను కడతేర్తును ఘూర్తునటంచు తీవ్రబా
ణావళి నంపు; రామ వచనంబె అమోఘమొ, లేక క్రూరుడౌ
రావణు గూల్చు నాతని శరంబె బలాఢ్యమొ చూతు భూవరా!

భర:_సరియే! ఎవరి వ్రాత ఎట్లున్నదో? నే వచ్చిన పని నిష్ఫలమైనది.

అంగ:_ఈవిషయమున మీరాశ సఫలము కాగలదని రాముడు మాత్రి మెట్లాశించెను స్వామీ!

జాంబ:_శ్రీరాముని సేవాభాగ్యమున కపిలోకమున కీమాత్రము దయా ళుత్వము, సత్యాభిలాష లభించవని యెంచెనా రాఘవుడు!

ఆంజ:_పాదదాసుడగు ఆంజనేయునియందు మాత్రము విశ్వాసము లేకపోయినదా ప్రభువునకు!

భర:_ఏమైన నేమి?

చం. చెడినది రాయబార, మిక చేయక తప్పదు సంగరమ్ము, ఈ
గొడవ పరిష్కరింపగల కోవిదుడెవ్వడు లేడు; రాముడా
విడువగబోడు పట్టుదల_వీడరు మీరును నీయయాతి; ఏ
ర్పడు ఫలితార్థముల్_నుదుటి వ్రాతల రీతు లవెట్టులున్నవో?

మరి నే వెళ్లి వచ్చెదను.

ఆంజ:_మంచిది. నమస్కారము. మాగురుదేవునితో పర్యవసాన మిట్లు నివేదింపుడు.

ఆ. వె. గురునికొరకు భక్తకోటుల వధియింప
పాడిగాదటంచు పలికె నను;
వేయి మనవులేల ప్రియమైన తన బంటు
కాంచియైన దాసు గావు మనుము.

కాదేని ఏభీకరాశనిపాతమునకైనను, ఏమహా ప్రళయమునకైనను వెరవక, తప్పక ప్రతిఘటింప నుంటి మనుము.

(ఇరువురును చెరియొకవైపునకు నిష్క్రమించుచుండ తెరపడును.)

---

# శ్రీ రామాంజనేయము.

## అష్టమాంకము.

---

(ప్రదేశము రణరంగమున శ్రీరాముని శిబిరపరిసరము
ప్రవేశము నారదుడు.)

నార:-శ్రీమన్నారాయణ! నీలీల లత్యద్భుతములుగదా! ఆహా!

మ. ఒక భక్తున్ బరిమార్పగా సకలసైన్యోపేతుడై గొప్ప పూ
నికతో రాఘవుడేగుదెంచె నిటు సందేహంబులే కాత్మలో,
అకలంకోజ్జ్వలు పావనిన్ గెలువ శక్యంబా మహావీరమా
రకుడా రామున కేమి పిచ్చి యిది తెల్వన్ లేదొ ఆతత్త్వముల్.

ఈమూల శిబిరములు-ఆమూల యుద్ధసన్నాహములు. భళి! భళి! భక్తుని జంపుటకు బ్రహ్మాండమగు సైన్యము. అదే శ్రీరాము డేదియో దీర్ఘాలోచనామగ్నుడై యున్నాడు. (అంతట తెర లేచును) రామచంద్రా!

రామ:-నారదా! రండు. యుద్ధభూమియందు కూడ ప్రత్యక్ష మగుచుంటిరే! ఇదియెల్ల తమ ప్రభావమేనా యేమి?

నార:-నారాయణ! సామాన్య మానవునివలె నీవును నన్నే నెపపెట్టుచుంటివా? నిజమున కేక్షణమున కాక్షణ మీవిపరీత విపత్కర పరిస్థితి తప్పించుట కెంత శక్తివంచనలేక ప్రయత్నించితినో-ఆదైవ మెరుగును.

రామ:-అబ్బే సంగ్రామరంగమునగూడ దర్శన మిచ్చుటచే చమత్కారమున కట్లంటిని.

నార:-ఇచ్చటికి వచ్చుటకు కారణము లేకపోలేదు. రాఘవా!

గీ. సంధిపత్రిన నాదగు సాక్షివ్రాలు
లేకనే ఎట్లు చెల్లు, నీలోకమంను
తండ్రి బిడ్డల కెట్టి యుద్ధంబు నడచు
నో విలోకింప వచ్చితి దేవదేవ!

రామ:—ఆఁ! హనుమంతుఁడు సంధికి వచ్చుచున్నాడా?

నార:—బాగున్నది. యుద్ధమునకే దిగనివాడు సంధికెట్లు రాగలడు?

రామ:—మరి సంధిపత్రి మనుచుంటిరేల?

నార:—చివరకు సంధికాక మరేమి కాగలదు?

రామ:—ఏమో! రాయబారవైఫల్యమునగదా రణోన్ముఖులమైతిమి. రంధియేగాని సంధి యెట్లు కుదురును?

నార:—కాని రామచంద్రా! నీవేమనుకొనుచుంటివో కాని అత డసాధ్యుడోయి! యుద్ధము చేయకయే నిన్ను నిర్జించు నూతనవిధానమట! అది యేవిధానమో! ఏమో! ఏదియో చక్కని పేరు. దాని తత్త్వము మాత్రి మిది.

ఉ. ఆయుధమే ధరింపడట ఆహవరంగము చేరడంట ఏ
దో అపురూపమైన ఒక తోవ చరించి విచిత్రియుద్ధముఁ
జేయుచు నిన్నుదుర్చునట, సిగ్గెదపీ వతగాడు యుద్ధమే
సేయగ వచ్చెనా? రణము సేయనివానిని నెగ్గుటెట్టులో?

ఆఁ! ఆపేరు జ్ఞప్తికి వచ్చినది, సత్యాగ్రిహమట—సత్యాగ్రిహము. ఇది యేదో క్రొత్త గ్రిహమువలె నున్నది. నేనెప్పుడును వినలేదు. ఇంతకును మొండివాడు రాజుకంటె బలవంతు డను సామెత యున్నదే కదా!

రామ:—విషయమే అపూర్వము, విధాన మపురూపమగుట వింతయా! కానిమ్ము. ఈలకు మించిన లోతు కల్గునా! ఎట్లు జరుగునో ఏమి జరుగునో నారదా!

శా. ఆలోచించుకొలంది నీ విషసమస్యారంభముండుండియుఁ
నాలో ఎట్టి తుపాను రేగెడినొ డెందం బెల్ల అంగారపూ
శైలంబట్టుల నెంత క్రాగెడినొ ఈస్వాంతమ్ము నం డెంత క
ల్లోలంబై అని సాగుచున్నదొ ... ... ...

ఏమైన నగుగాక, అతనితో యుద్ధము చేయుటయే తథ్యము.

నార:—రామా! అతనివిధానము గ్రిహించినతరువాత విజయరాముడవను పేరుగాంచిన నీవిజయమును నేనే శంకించుచున్నాను. ఏమందువా?

ఉ. నీకడ అస్త్రశస్త్రము లనేకములుండును గాక మారుణో
    ద్రేకముమై మరుత్సుతు నెదిర్చెదుగాక అహింస అండగా
    ఆ కపివర్యుడుండె; విజయం బతగానిది నిశ్చయంబు, ము
    ల్లోకము లేకమైన మనలో మనమాట అహింస యోడునే?

నారాక నీసంగ్రామోద్దేశమును మరలించుటకే. ఇప్పుడు యుద్ధము చేయువాడవు నీవు, చేయనివా డతడు. ఎట్లు జయించుట? ఎదిర్చిన శృంగభంగము తప్పదు.

గీ. అతడు సాత్వికసంపన్నుడౌ మహాత్ము
    డయ్యె! ఆతండు పూనె సత్యాగ్రహంబు,
    దాని ముందర నీ రణజ్ఞాన మెల్ల
    కట్టుతో కత్తి నటికిన కరణి నగును.

కావున ఈశృంగభంగ పరాభవ మొందుటకంటె సావకాశముగ ఆలోచించి బుద్ధి నుపయోగించి మారుతిని వంచించియైన గురునాజ్ఞ పాలించుట మంచిది.

రామ:—నారదా! ఇది ఆంజనేయునకేగాదు నాకును పరీక్షాసమయమే.

గీ. మాట చెల్లించుకొనలేని మానవుండు
    రాముడను నీదకంటె శ్రీరాముడన్న
    మాట నిల్పుకొనంగ సంశయములేక
    పరిభవం బోర్చనను పేరె వాంఛితమ్ము.

యుద్ధమునందే కృతనిశ్చయుఁడను. (నిష్క్రమించును)

నార:—హరిహరీ! ఎంతఘోర మేర్పడినది?

ఉ. బిడ్డకు నచ్చ కిప్పుడొక పెద్దవివాదము—కాదు యుద్ధ మే
    ర్పడ్డది ఓట మెవ్వరికి వచ్చిన నిర్వుగు నోడినట్లె యీ
    గడ్డు పరిస్థితిక్; విజయగౌరవ మిర్వురు నొందగల్గుటే
    దొడ్డ విచిత్రమ ట్లిపుడు తోచును పర్యవసాన మెంచగా.

హరినారాయణ! (నిష్క్రమించును, తెరపడును.)

———

# శ్రీ రామాంజనేయము.

## నవమాంకము.

---

(ప్రదేశము:—సంగ్రామరంగము.)

(ప్రవేశము:—లక్ష్మణునితో యుద్ధములో మూర్ఛపడియున్న అంగదాదులు, లక్ష్మణుడు.)

లక్ష్మణుడు:—

శా. ఏరీ మాసరివారు గెల్వగలవా రీరేడు లోకాలలో
లేరంచున్ దెగ విఱ్ఱవీగితిరి త్రుళ్ళింతల్ పటాపంచలై
ధీరత్వమ్ములు నీరుకారినవి కాదే ఆంజనేయుండు మీ
దారింబట్టగజేయు లక్ష్మణుని కోదండంబు దుర్వారమై.

ఆత డాహవభూమికే రాడటగా! నేనే ఏగెదను. (రెండడుగులునడచి పరికించి తలపంకించి) ఓహో! ఈగుహాచెంతనే కొంగజప మాచరించుచు కూర్చుంటివా మారుతీ! అదిగో మీవారిగతి కనులార వీక్షించితివా? పరివర్తనము కలిగెనా? యయాతిని విడుతువా?

ఆంజ:—(తెరప్రక్కనుండి కొంచెము ముందునకు వచ్చి వినపించుకొనకుండ)

గీ. క్షేమమా మీకు లక్ష్మణస్వామి? రాము
డంపెనా మిమ్ము కోతుల జంపుకొఱకు;
అన్నిజంతుల మాంసంబు లట్లు కోతి
మాంసముం గూడ తిందురా మనుజపతులు?

లక్ష్మ:—అంజనీతనయా! వీరులు మాంసపేశుతో యుద్ధము చేయుదురా! వీరాంజనేయుడవైన నీవే మొనర్చితివి?

గీ. వెనుక మాతను వెదకంగ వెడలినపుడు
పిదప సంగ్రామ రంగాన పెక్కుమంది
రాక్షసుల జంపితివి, మాంసభక్షణార్థ
మేన? ఆ ఆంజనేయుడవేన నీవు?

ఆంజ:—స్వామీ!

శా. మ్రాకై నాడు వధింపలే దసురుల్ణ మా కేలనో ప్రేతముల్
శాకాహారులమైన మాకు తిన మాంసం బేల? భోగాత్ములా
మీ్రాకై నా డనిలోన జంపితిని సుమ్మీ రాక్షసానీకమున్
లోకాలన్ని గ్రహించినట్టి నిజమే నోలక్ష్మణా! ఆకథల్.

లక్ష్మ:—నిజమే! మాకొరకే నాడు రాక్షసుల వధించితివి, నాటి విష యము లింకను జ్ఞప్తియందున్నవే నీకు!

ఆంజ:—నాటి విషయము లేనాటికైనను మాకు మాత్రము జ్ఞాపక ముం డునవియే!

లక్ష్మ:—అగు నట్టి రామాభిమానివే! రామ విధేయుడవే! కాని మా రుతీ! నేడు నీస్వామి మాటపై గౌరవ ముండకపోవుట—?

ఆంజ:—నాస్వామి మాటపై గౌరవములేదా లక్ష్మణా! అసత్యము. ఏనా టికైన నాస్వామిపై గౌరవము నాజీవితముండగా పోవునది కాదు.

లక్ష్మ:—అది మాటలయందే కాని క్రియలలో కాదేమో!

ఆంజ:—ఆంజనేయుడు క్రియాశూన్యుడై కేవలము మాటలతోడనే సరిపె ట్టెనో, కార్యరూపములో రామదాసుడై ప్రవర్తించెనో లోక మెరుంగనిదికాదు.

లక్ష్మ:—ఆకారణముచేతనే మాసోదరుని రాయబారమంపి మన బాం ధవ్యమునకు భంగము కలుగకుండ శ్రీరాము డింత శ్రమించుట.

ఆంజ:—అది వృధాప్రయాసము. ధర్మసంరక్షణార్థమై జన్మించిన రాఘ వుడు స్వార్థముకొరకు పతుల నధర్మ మాచరింప నుద్బోధింపరాదు.

లక్ష్మ:—పావనీ! నీవు నీస్వామికి నిష్కారణముగ బాధ కలిగించుచున్నావు సుమీ!

ఆంజ:—నాకాయుద్దేశ్యమే యున్న తప్పక ప్రాయశ్చిత్తము కాగలదు.

లక్ష్మ:—కాని యయాతిని రాముని కప్పగించ వంతియేనా!

ఆంజ:—యయాతిని రామబాణమున కప్పగించుటా! అదియే రామదాసు చేయలేని పని లక్ష్మణా!

లక్ష్మ:-బుద్ధిపూర్వకముగ నీవినాశమునకు సామాగ్రి చేకూర్చుకొనుచుంటివి సుమా!

ఆంజ:-నావ్రాతకు నీవు కర్తవా రామానుజా!

లక్ష్మ:-దూర మాలోచించుటలేదు నీవు.

మ. హనుమా! శాంతముతోడ చెప్పితిని సుమ్మా, ఇంత దూరమ్ము నీ
కును మాకున్ గల స్నేహధర్మమున, లేకున్నన్ సుమిత్రాసూతికిన్
నిను నిర్జించుట లెక్కలోని పనియా నే నాటి యుద్ధంబులో
నిను బంధించిన మేఘనాధు వధయేనిన్ జ్ఞప్తిరా దేలనో?

ఆంజనేయుడు:—

శా. అబ్బో! అంత మహారధుడవని కాదా! నాటి యుద్ధంబులో
తబ్బిబ్బై, తలక్రిందులై తుదకు నిస్ప్రాణంబుగా మూర్ఛిలన్
సిబ్బందీ మొనగాడ నీవగుట సంజీవాద్రి తోడ్తెచ్చి ఓ
యబ్బా! ఊపిరి పోసినాడ! మన ధైర్యస్థైర్యముల్ క్రొత్తలా.

లక్ష్మ:-స్వామిద్రోహఖలమతీ! మారుతీ!

ఉ. కోతుల కింత కావరము కూడదు మా రఘురాము డింత మీ
జాతిని పెద్ద చేసి శిరసావహించిటు పెంచె కొమ్ములన్
నీతి దొరంగి నీప్రభువునే ఎదిరింపగ నున్న నీవు న
న్నితరి గెలిచేయు టరిదే? కపిజాతికి నీతియున్నదా?

ఆంజ:-మాజాతినే దూషించుచుంటివిగా లక్ష్మణా!

ఉ. కూడని మాటలాడకుము, గొప్పలు కూడునె అన్యజాతి ని
ట్లాడిన యంత? నాకు మన యక్కఱ దీర్చిన జాతి నేటికిన్
పాడయిపోయెనా కపులపాలిటి స్వాములకింత! చెప్పిన
ట్లాడెడు కోతిగాడనుచునా; చనుదెంచితి యుద్ధభూమికిన్.

లక్ష్మ:-ఒకప్పుడు చెప్పినట్లాడెడి కోతి పెంకిపట్టు పట్టగా దాని తిక్క తీర్చి చెప్పినట్లు చేయించుటకే నేవచ్చిన పని.

ఆంజ:-వశమైన అట్లే చేయుమయ్యా!

లక్ష్మ:-అట్లైన ఇదే అస్త్రప్రయోగము చేయుచున్నాను. కాచుకొనుము.

ఆంజ:-సంసిద్ధుడనే. ప్రయోగింపు మీయిష్టదైవమును తలంచికొనియో-
(ఆంజనేయుడు తారకమంత్రోచ్చాటనము సల్పుచుండగా లక్ష్మణుడు బాణప్రయోగము చేయుచుండును. ఆంజనేయుడు లక్ష్మణుని బాణప్రయోగమున కసాధ్యుడుకాగా శ్రీరాముడు ప్రవేశించును. ఆంజనేయుడు శ్రీరామునకు ప్రదక్షిణ మాచరించుచు తారకనామ ముచ్చరించుచుండును.)

రాముడు:-కపిరాజా!

చం. ఒకపరి నాదెసం గనుమ ఓహనుమా! రఘుదేవుడంచు న
న్నొక సమయాన గొల్చిన మహోద్యమముల్ లవలేశమైన యెం
చక వికటింపనుంటి విది సాహసమంచు తలంపవో అమా
యకుడవు మమ్మెదుర్ప దగునా! ఎట నేర్చితి వీయకృత్యముల్.

ఆంజ:-స్వామీ! ఒకరు నేర్పుట కేమియున్నది?

గీ. ప్రాణరక్షణకై భయస్వాంతుఁ డొకడు
వేడగా రామదాసు కాపాడు టరుదె?
ఆ విభీషణు నెటు గాచినావు స్వామి!
నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష!

రామ:-కాని యయాతి విభీషణు లిద్దరుకు శరణాగతులే యైనను ఇర్వురకు హస్తిమశకాంతర మున్నది.

ఆంజ:-నిజమే స్వామీ! అతడు శత్రుకోటిలోనివాడు. ఇతడు భక్తకోటి లోనివాడు.

రామ:-ఆభేదముకాదు నే వచించుచున్నది. నాటి పరిస్థితికిని నేటి పరిస్థితికి మహాసముద్రమంతటి వ్యత్యాసమున్నది. నా ఆచార్యు నెవ్వనిం గాని తిరస్కరించి విభీషణ శరణాగత త్రాణుడను కాలేదు. నేడో నీవు నీస్వామిని ధిక్కరించి ధూర్తుడవై చరించుచున్నావు.

ఆంజ:-ఇది న్యాయమా? 'దీనజనావన' బిరుదాంకుడవే! శిష్టరక్షణ యశోవిశాలుడవే!

రాముడు:-అన్నిటికన్న ధర్మనిర్వహణమే అస్మదాదుల కపేక్షణీయము.

ఆంజ:-సజ్జన రక్షణము రాజధర్మముకాదా?

రామ:-కావచ్చును. కాని యిపు డీవితండవాదన కవకాశము లేదు.

ఆంజ:—అవకాశ మెట్లు కలుగగలదు రాఘవా!

శా. వాలిం గూల్చిన వీరవర్యుఁడవుగావా స్వామి చల్లాడగా
నే లేదా అలనాటి కోలకు క్షుదాగ్నిజ్వాల నీభక్తు జే
వాలం దీయగ దెచ్చినా విపుడు, విశ్వామిత్రకోపానల
జ్వాలాకీలల గాల్చి; నీగురుని శిష్టాధర్మ మిాచందమా?

రామ:—నీ అతివాచాలత నాపుమింక.

మ. అతిలోకోత్తరుడైన మానిమణి మాఆచార్యుడన్నట్ల దిర
స్కృతి గావింపగ ప్రేలబో, కతనిదా శిక్షావిధానంపు యో
గ్యత నీవెట్లు గ్రహింపజాలెదవొ మూఢాత్మా! గురుద్రోహివై
ప్రతిగా ధిక్కృతి వింతవాడ వయినావా యింతలో మారుతీ!

ఆంజ:—గురుద్రోహినో—గురుసేవాభిలాషినో లోకమే ఎఱుగును.

సీ. ఆలిని గోల్పోయి ఆర్తి జెందగ ఆమె నగలమూటను జూపునాటి మాట
సీతమ్మ జాడతీసినవాడు లేక నాకంగుళీయక మిచ్చినప్పటి కథ
తమ్ముడు సమరాన సొమ్మసిల్లగ 'నలో లక్ష్మణా' యనుచు డీల్పడిన గొడవ
మైరావణాధము మాయలో బడి కాళిగుడిలోన బంధింపబడిన చరితె
విన్న వారిక మారుతియన్న నెట్టి
వాడొ తెల్పమే! అతండు స్వామిభక్తి
తత్పరుడో, గురుద్రోహియో, ధాత్రి కెల్ల
విశదమే రాఘవేశ్వర వేయియేల?

రామ:—ఇంతటి గొప్పవాడవని కలనైన తలంపలేదు సుమా మారుతీ!

సీ. చేసిన గొప్పనే చెప్పి జీవనచేయు బుద్ధిమంతుడ వంచు పోల్చనైతి
వెనుక చూపించిన వినయసంపత్తితో నిటు సాహసింతని యెరుగనైతి
నావాడ వనుచు మన్ననల పెద్దగజేయ పీకు మేకౌనంచు నెంచనైతి
కాంచిరమ్మన్న చో కాల్చివచ్చుఘనుండ వనుచురవ్వంతయు నరయనైతి
ఎంత చేసిన నేమి! నీవెంతఘనుడ
వైన నేమాయె నీ చేసినదంత సున్న
చుట్టకొని పోయె నేటితో నెట్టులనిన,
ఒక్క-ధిక్కృతితోడనే ఉన్నయట్టి
మారు నోముల ఫలమెల్ల మారిపోయె.

ఆంజ:_స్వామీ! దృక్పథము మార్పుచెందియుండవచ్చును గాని ఆతని పాదదాసుని తత్త్వము పంచభూతము లున్నంతవఱకు మారునది కాదు.

రామ:_శ్రీరాముని దృక్పథమునందలి మార్పును గుర్తింపగల్గిన ఘనుడవు బయలు దేరితి వే? అమాయకుడా! మాలక్ష్యమెల్లప్పుడు నొక్కటియే. అదియే సత్యసాధనము. ధర్మనిర్వహణము. ఏతద్విషయమున ఆత్మబంధువులనైన లెక్కింప డీరాముడు. ఇది గుర్తించితివా?

ఆంజ:_గుర్తింపకేమి? మేమెంతవారము?

ఉ. పూతచరిత్రి_పుణ్యసతి_భూసుత అగ్నిపరీక్షయా జగ
న్మాతను_తప్పు త్రాగి యొకనాడొక చాకలి ప్రేలగా వన
వ్రాతమునందునే విడిచి రమ్మని యాజ్ఞ నొసంగినావు నీ
చేతల కస్మదాదులన చింత రవంతయు పుట్టునా ప్రభూ!

రామ:_ఆత్మసతి విషయమునందుసైతము ధర్మనిర్వహణమే మా ఆశయము.

ఉ. వెంగలిగాను_జానకి పవిత్రత శంకయొనర్చిగాదు అ
ర్ధాంగిని_నిండుగర్భవతియైన మనోహరి గానలోన వీ
డంగ_శిరాన ధర్మమకుటంబును దాల్చిన నేను సీతి ని
ల్పంగ మదీయ పాలితుల వర్తన దిద్దగ నెంచి మారుతీ!

ఆంజ:_అగును స్వామీ!

ఆ. వె. ప్రజలమీది ప్రేమ పట్టంగలేక నే
పాప మబల వనికి బాపినావు;
గురునిమీద భక్తి కొండంత యుంట చే
భక్తు నొకని జంప వచ్చినావు.

చావున కేమి? చంపుట కేమి?

ఉ. చంపగవచ్చు నేరమున చచ్చెడివారలె రేపొ మాపొ; నీ
చంపదలంచు నాతని విచారణచేసి వధార్హుడైనచో
చంపగవచ్చువాని, ననుసైతము గూల్పగవచ్చు;(కాని)కొంటె గు
ర్వంపిన యంతనే తగునటయ్యా వధింపగ భక్తకోటులన్?

రామ:—అడి తప్పని రఘువంశము మాని.

ఆంజ:—ఆరాఘవు సేవాభాగ్యమున తరించిన మాకును ఆడితప్పకుండుట యుచితమే.

రామ:—ఇది మాగురువర్యు నాజ్ఞ.

ఆంజ:—నిజమే కావచ్చును.

గీ. నీకు గురునాజ్ఞ యగుగాక నాకు మాత్ర
నాజ్ఞ నీకంటె కోటిరెట్లధిక మయ్య
నాకు గల బాధ్యత మహాత్మ! నీకు నాకు
ఆజ్ఞ లిచ్చిన వారిలో నగ్రగణ్య
యగును మాయమ్మ రామచంద్రా! నిజమ్ము.

రామ:—అయిన నీవు నీమాధ్యమును వీడి యయాతిని విసర్జింపవన్న మాట?

ఆంజ:—స్వామీ! ఈవిషయమును గాక వేరొండు ఆజ్ఞాపింపుడు. శిరసా వహింతును.

రామ:—క్షమించి విడుతు ననుకొంటివేమొ! నీ జీవితముపై ఆశ చాలించుకొంటివా?

ఆంజ:—ప్రాణభీతి నాకేనాడో అంతరించినది రామచంద్రా!

రామ:—యుక్తాయుక్తవిచారము లేక తలకు మించినవారితో కయ్యమునకు కడంగితివి. ప్రత్యర్థి సామర్థ్య మెరింగియు నిట్టి మూర్ఖ్యము వహించు నీప్రారబ్ధమేమో!

మ. అకలంకోజ్జ్వల సత్యనైష్ఠికులు మాయిక్ష్వాకులే సర్వదా;
ఒకటే మాట యటన్న కీర్తి గొనినారో చంచలాత్మా! ప్రతి
జ్ఞకు నిల్వగలట్టి రాఘవుని ప్రజ్ఞాపాటవం బెంచుచో
ఒకటే బాణ మొకండె మాటయని నీవూహింపవో మారుతీ!

ఆంజ:—అట్టి మహావీరుని చేతులలో నేది యెట్లైనను సంతసమే. కాని ప్రభూ! దేవర కొక్కటే మాట యనుటలో శంక లేదు. కాని ఒకటే బాణ మనుటలో కొంత సందేహము. ఏమందురా?

రామ:—ఆ! ఏమంటివి? రామబాణమున కెదురు లేదని విస్మరించితివే. సప్తతాళభంజన—వాలి వధ—

ఆంజ:- అగును స్వామీ! అగును.

మ. ఎదురే లేని శరప్రయోగపు బలం బేమయ్యెనో స్వామి నా
కదియే తోపదు చెట్టుమాటు గొననేలా వాలి చంపంగ? మి
మ్మెదురింప న్మయిరావణుండు శరమో-ఈబంటు-మీకీర్తి రసం
పద హెచ్చించిన గౌరవంబు గొనుటల్ భావించినావా ప్రభో.

రామ:- ఆత్మశ్లాఘ పరాయణా-వాయునందనా! నిన్నింక ఉపేక్షింప తగదు. శ్రీరామబాణ నైశిత్యము నీపట్టుదలనే కాక రూపురేఖల కూడ మార్పగలదు కాచుకొమ్ము.

ఆంజ:- చిత్తము కాచుకొనియే యుంటిని స్వామి!

రామ:- కాని యయాతి యెందున్నాడో మాత్రము వచింపవు.

ఆంజ:- నన్ను వధించిన పిదప గాని యయాతి మీకు దక్కడు.

రామ:- కానిమ్ము.

శా. నేనే నిశ్చల సత్యనిష్ఠుడనేనీ పితృవాక్పాలనా
ధీనస్వాంతుడనేని-ధర్మగతియందే నిల్చి యెల్లప్పుడున్
లీనంబౌ స్థిరబుద్ధి నాకు కలదేనీ-ఏకపత్నీవ్రతా
నూన శ్రీకలితుండనేని-జయవంతుం జేయురే దేవతల్.

కాచుకొనుము (శరసంధానము చేయబోవును.)

ఆంజ:- చిత్తము కాచుకొంటిని.

శా. నేనే నిర్మల భక్తితత్పరుడనేనీ-మాతృదేవీ పద
ధ్యానైకాత్ముడనేని-తారకమె నిత్యంబౌచు తేజోదరి
ద్రాణంబౌ జగ ముద్ధరింపగల మంత్రంబైన, నన్ ధర్మదీ
క్షానిష్ఠాత్ముని రామనామబలమే కాపాడి రక్షించుతన్.

రామ:- మారుతీ! నీవు ప్రతియుద్ధ మాచరింపక మమ్మధర్మయుద్ధమునకు మరల్చుచుంటివా?

ఆంజ:- ప్రకృత మాంజనేయుడు చేయగలిగిన దంతియే స్వామి!

రామ:- నీశరణార్థి దాగిన ప్రదేశమునైన గ్రహింపలేడనుకొంటివా రాముడు? అతని నెచట దాచితివో చెప్పకుంటివే!

ఆంజ:_నావధానంతరము విశదము కాగలదని చెప్పితినికాదా ప్రభూ!

రామ:_మంచి పన్నాగము పన్నితివే! శిష్యచూడామణీ!

ఉ. చూచుకొలంది నీరణము చోద్యము-డీకొనకుంటి వెంతగా
వేచిన_ధర్మయుద్ధ మపిపించి కరమ్ములు సాగకుండె; ఆ
లోచన కంద డేస్థలములో నరపాలుని దాచియుంటివో!
దాచితివేమొ నీహృదయతామరసంబున వాయునందనా!

ఆంజ:_స్వామీ! నీపాదదాసు నెరుంగనట్లు మాటాడుచుంటివే! ఆరాజ న్యుని నాహృదయసీమలో దాచికొంటిననియా నీయనుమానము?

ఉ. ఆమనుజాధిపు నిలుప నచ్చట స్థానము లేదు; మాకుల
స్వాములు సర్వలోకపరిపాలకులౌ నను గన్న జానకీ
రాములు వాసముందురు నిరంతర మచ్చట మామకీన హృ
త్సీమను చూచుకొమ్మదిగొ చీల్చెద మిథ్యయొ సత్యమో ప్రభూ!

(హృదయము చీల్చి చూపును. దేవతలు పూలవాన కురిపింతురు. లక్ష్మణాదులు చేతులు జోడింతురు)

రామ:_ఆహా! ధన్యుడవు మారుతీ!

గీ. లేదు వ్యత్యాస మనుమాట లేశమైన
నీకు నాకును పావనీ నేనె నీవు
నీవె నేనను సత్యంబు నెలకొలుపగ
ఈశ్వరుండె సంకల్పించెనేమొ యింత.

నార:_ఆహా! ఏమి దృశ్యమిది! నేటి ప్రేక్షకు లెంతధన్యులో! మహేశ్వర సాక్షాత్కారము, బృందారకుల పుష్పవృష్టి. పరమకోపిష్టి విశ్వామిత్రుని భక్తిపారవశ్యము. ఆహా! చూచుట కెంత ముచ్చటగా నున్నది!

విశ్వా:_ఆహా!

చం. ఇతఁడు మహానుభావుఁడు-మహేశ్వరునంతటివాడటన్న సం
గతి జనులెల్లరుం దెలియగా కలహాశనువక్షువెట్టె ఈ
గతిని సృజించె నాటక మొకండు పరాత్పరు డౌర భక్తియే
అతని బలంబు నెగ్గిన దహంబున కోటమి తప్ప దెప్పుడున్.

నారదుడు:—

గీ. మంచి అవకాశ మిదియె యోమనుజనాథ!
లేచి రావోయి వేగ సంకోచమేల?
కౌశికుని కాళ్లపైఁబడి కావుమంచు
వేడుకొనుమయ్య వేరొండు వెరవులేదు.

(యయాతి చేయిపట్టుకొని నారదుడు విశ్వామిత్రుని సమీపించును. యయాతి విశ్వామిత్రుని పాదాభివందన మాచరించును.)

విశ్వా:—దీర్ఘాయురస్తు.

శ్రీరామ:—వెల్వడితివా అభాగ్యుడా!

మ. నిలుమోయీ ధూర్తుడ! యెందు బోఁగలవురా! నీప్రాణముల్ బొందెలో
నిలుపంగా గల ధీరు డెవ్వడిట లేనే లేడు; శ్రీరాముడు
జ్వలకోదండము వంచి నారి సవరింపన్ జారు నీప్రాణముల్;
కలుషాత్మా! కడతేరె నీవు బ్రతుకంకన్ దిక్కు నీకెవ్వరో?

(బాణప్రయోగ సన్నద్ధుడు కాబోవును.)

నార:—రామచంద్రా! శాంతింపుము. తీయ నెంచిన బాణమును తూణీరమున నె యుంచుము—విశ్వామిత్రపాదాభివందనముతో నీ ప్రతినయు చెల్లినది. నీగురుడే ప్రాణదానము చేసి దీర్ఘాయురస్తు అని నాడు. శ్రీరామాంజనేయు లిద్దరు నెగ్గినట్లే. భక్తి జయించినది, సత్యము నెగ్గినది. ఇది శుభాంతమగు చక్కని సన్నివేశము.

—: మంగళము :—

(సమాప్తము.)

## ఈ నాటక ప్రదర్శనములం దుపయోగింపబడుచున్న కొన్ని పాటలు.

### ఆంజనేయుడు

1వ పాట. పేజి 26

రఘురామచంద్ర-రావో-బ్రోవ
దీనజనావన-దేవకృపాళో ||రఘు||
సీతారమణా-శ్రితపాలన ఘన
జయతు జయతు శ్రీ-జయాభిరామా ||రఘు||

2వ పాట. పేజి 37 (కోరస్)

జయ జయ రామా! - జయ రఘు రామా!
మునిజనపోషా! - బ్రోవ రావా ||జయ||
పవమాననంద - భవపాపనాశ!
రమణీయరూపా! - రఘుదేవా! ||జయ||

3వ పాట. పేజి 51.

శ్రీరామా బ్రోవ రాగదే! రఘు
రామా దయచూపవా!
ప్రవిమలరూపా! రవికులదీపా!
దాతవు నీవే-దైవము నీవే
రావో ప్రభో వేగమే ||శ్రీరామ||
శ్రితజనభరణా - సీతారమణా
దేవా బ్రోవ రావా
పతితుల గావ - భారము నీదే
రావో-ప్రభో-వేగమే ||శ్రీరామ||

4వ పాట. పేజి 51

హే-ప్రభో-రఘువరా-
పాహి ప్రభో-పాపహరా
పతితోద్ధర - వందే
భక్తజన - పరిపాలా

అరుదెంచితివా - కరుణాభరణా
ధర్మము గావ - దయచేసితివా.
పతితోద్ధర వందే.

శ్రీ రా ము డు

1వ పాట

ధాతా! నీమహిమా - తెలియగా
పావనమా - జయసాధన మగుగా ॥ధాతా॥
భక్తుని ద్రుంపగ పోలెగా
సత్యమెగా - ప్రధానం బాహా!
శాశ్వతమగు సిరి - యశమె జగానా
నిశ్చయమేగా ॥ధాతా॥

2వ పాట

ధర్మము జయమొందుటయే
స్థిరము జగానా - నిజము జగానా
కాన
వెను-కాడా - తగునా బేలతనాన? ॥ధర్మ॥
సత్యానికే - నిరోధమై
ఒక భక్తుడు నిలువ
వాని - క్షమించి - ఉపేక్ష
పూనుట తగునా?
ధర్మమె తలచి - సత్యమె వలచి
నిలిచినచో జయమా - నిజమే ॥ధర్మ॥

నారదుడు

(1)

మధుసూదనా - హే శౌరీ
నీ లీల తెలియ వశమా? ॥మధు॥
శ్రితజనపాలా - హరీ - మురారీ!
నీదు మహిమనే - తెలియ తరమా? ॥మధు॥

(2)

"భళి భళి! కలహాబీజము లభించెన్?" ||భళి||
వృక్షంబై యిది పూచి ఫలింపన్
మోదముకాదే నీయ దేవా! ||భళి||

(3)

దేవ దేవ హే! దీనావన ||దేవ||
భక్తపాలనా-పావన నామా ||దేవ||
భక్తప్రభావ మమోఘము కాగా
సమస్తార్చితివే-సాధనలెల్ల
నీదు మహాత్మ్య మహా ||దేవ||

(4)

శ్రమ ఫలించె నాహా
నా
శ్రమ ఫలించె నాహా ||శ్రమ||

(వరా:-తరంగాలు-అష్టపదులువీలు వెంబడినుపయోగించుకొనవచ్చును).

# హెచ్చరిక.

ఈనాటకాన్ని ఎవరైనా ప్రదర్శించుకోవచ్చు. కాని సర్వాధికారాలు నావి. ఇందులో కొంత భాగాన్నికాని, అంతాకాని ముందుగా నా లిఖితపూర్వకమైన అనుమతిని పొందనిదే ఎవ్వరును ఏవిధమైన ప్రదర్శనాల్లోను ఉపయోగించుకొనరాదు. ఇందలి ఏభాగాన్నికాని, అంతాకాని ఏవిధంగా ఉపయోగించుకోదలచినా సక్రమమగు నాపర్మిషను పొందాలి. లేనిపక్షంలో నే చేయు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులై నే కోరిన నష్టపరిహారమునకు గురికాగలరు.

మ. జ.

---

Printed at the Razan Electric Press, Kakinada—1000 Copies.

# సవరణలు.

| పుట | బంతి | ముద్రణ | సవరణ |
|---|---|---|---|
| నాంది | 1 | మూర్తి | మూర్తి |
| | 2 | ద్యాగృతార్థుడయి | మారుతాత్మజుడు |
| | 4 | రగులుచు | రగులును |
| | 7 | భూయిష్ట | భూయిష్ఠ |
| | 8 | నానాయర్పించు | నాయర్పించు |
| నామాటలు—చివరలైను | | సుబ్రహ్మణ్యశాస్త్రి | వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి |
| 13 | 1 | మిద్ధ | మిత్ధ |
| 13 | 12 | అపేక్షనీ | అపేక్షణీ (51—27) |
| 14 | 9 | పయిన | పయిని |
| 20 | 4 | విచ్చేయగ? | విచ్చేయ? |
| 23 | 10 | కృూరాత్మ | క్రూరాత్మ |
| 29 | 8 | జేవగియింప | జేవగింప |
| 29 | 24 | ఆంజని | అంజని |
| 32 | 7 | మరియాద | మర్యాద |
| 32 | 16 | బయుట | బైట |
| 33 | 18 | యూయతి | యయాతి |
| 33 | 19 | ప్రకృ | ప్రస్తు |
| 34 | 3 | కొని | కొనుచు |
| 34 | 9 | నప్ర | నాప్ర |
| 35 | 4 | దురంధురు | ధురంధరు (37 & 39—5) |
| 37 | 5 | పేషు | పేషా |
| 37 | 9 | శరణ్యా | శరణ |
| 37 | 12 | కిశరణ్యాంబిచ్చినాకన్ | శరణన్నన్ గాతునంటిన్ |
| 37 | 14 | కంబో | కంబో! |

| పుట | బంతి | ముద్రిత | సవరణ |
|---|---|---|---|
| 38 | 3 | కిశరణ్యంబిచ్చి | కభయంబై నిల్చి |
| 38 | 4 | స్వర్గమో | స్వర్గము |
| 40 | 18 | కోరతి | కోరితి |
| 40 | 22 | టమే | టయే |
| 42 | 5 | జోరుశరణ్యులెందు | జోరభయమ్ము నెప్డు |
| 48 | 15 | వినపించు | వినిపించు |
| 50 | 6 | సుమిత్రానూతికిఁ | తృణప్రాయుడా! |
| 50 | 10 | రఘుడ | రఘుండ |
| 50 | 16 | వహించి | వహియించి |
| 52 | 26 | నేమాయనీ | నేమాయె? |
| 53 | 9 | చరిత్రి | చరిత్ర |
| 54 | 21 | యిక్ష్వా | ఐక్ష్వా |
| 54 | 23 | నిల్వాగలట్టి | నిల్వంగలయట్టి |
| 55 | 14 | యెల్లపు | యెల్లప్పు |
| 56 | 9 | జాధిపు | జాధిపుఁ |
| 56 | 25 | వడ్గు | నడ్డు |

వ.రా:—కొన్నిచోట్ల ద్రుతమునకు 'య'డాగమపు పొరపాటు లున్నవి. పరిచూచుకొన ప్రార్థితులు.

# నా మాటలు.

ఈ నాటకం ఇప్పటికి పాతిక ప్రదర్శనా లివ్వబడింది. రక్తి విషయంలో జయప్రదంగా ఉన్నకారణంచేతే ప్రకటనకి ప్రోత్సాహం కలిగింది. రచయిత హక్కును గుర్తించే ఏ నటీనటవర్గమైనా, నాటక సమాజమైనా దీన్ని ప్రదర్శించుకోవచ్చు. (షరా:— అనుమతి పొందని ప్రదర్శనంలో పాల్గొను ఏ వ్యక్తిపైనైనా చర్య జరిపి, నష్టపరిహారం పొందే హక్కు నాకుంది.)

ఇంక దీని కీరూపు రావడానికి కారణం చెప్పడం నాకనీసధర్మం. చెప్పకపోతే అపరాధం. దీన్ని ఆదిలో ప్రదర్శించడానికి సర్వవిధాలా ప్రోత్సాహ మిచ్చిన శ్రీ గుత్తాల రామమూర్తిగారు (గోనేడ) చేసిన సహాయం మరువరానిది. వ్యయప్రయాసముల కోర్చి నష్టమైనా భరించి ప్రదర్శనాలు జరిపించారాయన. తర్వాత చేతులు మారి మరికొన్ని ప్రదర్శనాలు జరిగాయి, జరుగుతున్నాయి. ఆదికారకులైన శ్రీ G. R. మూర్తిగారే ఈనాడు దీని ముద్రణావ్యయం భరించి ప్రచురించడానికి తోడ్పడ్డారు. వారికి సర్వదా కృతజ్ఞుణ్ణి.

“రామాంజనేయయుద్ధము” వృత్తంగాగల నాటకాలు చాలానే ఉన్నాయి. అయితే మళ్ళీ ఇది వ్రాయడం దేనికి? వ్రాయవలసిన కారణం చెప్పవలసివస్తే బోలెడు గ్రంథం ఉంది. ఆవిషయం అలా వుంచి ముఖ్యకారణం దీని కోప్రత్యేకత ఉందంటాను. దానిని సహృదయులు గుర్తిస్తే కృతార్థుణ్ణి. ఏది ఎట్లున్నా దీని ప్రారంభానికి కారకులు శ్రీ మూనే సూర్యారావుగారనే చెప్పాలి.

ప్రారంభించింది పూర్తిచేయడానికి శ్రీ అరిగెల వెంకటేశ్వర్లుగారు కారణం. ఆయన కొన్ని పద్యాలకు పంపకంచేసి, చక్కనిరాగాలు కూడా కూర్చారు. తర్వాత B. ప్రభాకరరావుగారు ఈ నాటకంలో చాలా పద్యాలకు జీవం పోశారు. దీనికి అనువైన సంగీతం కూర్చిన వారిద్దరికీ నా ధన్యవాదాలు.

ఆఖరి విషయం—ఈ నాటక ప్రతిని అచ్చువేయడానికి అనుకూలంగా సాఫుప్రతిని వ్రాయడంలో తోడ్పడ్డ శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నా అభివందనాలు.

పెద్దాపురం,<br>ఖర శ్రావణ ౧౦.

ఇట్లు విధేయుడు,<br>మ. జయరామయ్య.

అప్పు డప్పుడు ఇచ్చిన ఈ నాటకప్రదర్శనాల్లో పాల్గొన్న ప్రముఖ

# నటీనటవర్గం.

శ్రీరాముడు:—శ్రీమతి దాసరి కోటిరత్నం, శ్రీమతి అబ్బూరి కమలా దేవి, శ్రీమతి జి. కస్తూరీదేవి.

ఆంజనేయుడు:—శ్రీమతి M. రాజరత్నం, శ్రీ పరాంకుశం కృష్ణమాచార్యులు.

విశ్వామిత్రుడు:—శ్రీ యస్. పి. రాజారావునాయుడు, శ్రీ ముప్పన అంకయ్య, శ్రీమతి యామినీపూర్ణతిలకం, శ్రీమతి కె. చిట్టి రాజు, శ్రీ పిన్నం రామమూర్తి.

నారదుడు:—శ్రీమతి అమ్మాణీబాయి, శ్రీ అరిగిల వెంకటేశ్వర్లు, శ్రీ పరాంకుశం కృష్ణమాచార్యులు.

యయాతి:—శ్రీ పారుపల్లి సుబ్బారావు, శ్రీ కస్తూరి నరసింహారావు, శ్రీ పి. వెంకటూరావు, శ్రీమతి సరస్వతీదేవి, శ్రీమతి జి. కస్తూరీ దేవి, శ్రీమతి యామినీపూర్ణతిలకం, మ. జయరామయ్య

లక్ష్మణుడు:—శ్రీ పరాంకుశం కృష్ణమాచార్యులు, శ్రీ ముప్పన గోపాలం, శ్రీమతి కె.మాణిక్యకుమారి, శ్రీముప్పనసూరయ్య.

భరతుడు:—శ్రీమతి పెద్దాపురం రాజు, శ్రీ ముప్పన అంకయ్య, శ్రీమతి టేకు అనసూయ, శ్రీమతి జి. కస్తూరీదేవి.

అంగదుడు:—శ్రీ రెడ్డి అబ్బాయి, శ్రీ యల్. కేశవదాసు, శ్రీమతి సూర్యప్రభ, శ్రీమతి రాజు.

అంజని & జాంబవంత:—శ్రీ సత్యాడ అప్పారావు, శ్రీమతి సుందరమణి, శ్రీమతి రత్నం.

హార్మోనియం:—శ్రీ బి. ప్రభాకరరావు, శ్రీ చింతాసుబ్బారావు, శ్రీ యం. నాగరాజు.

## లంకాదహనం

ఈ నాటకం ఆంధ్రప్రాంతములలో అక్కడక్కడ ఆడబడింది; ఆడబడుతోందికూడా. రచన పూర్వపు తోవను ఉన్నా రసపోషణ బాగానే ఉంది. "జాగృతి" 13-11-49.

LANKADAHANAM (Telugu) by M. Jayaramayya. Published by Hindi Premimandali, Peddapuram Price 1—4—0.

This popular piece from Sundarakandam in Ramayanam is written especially for staging as a drama. Keeping faithful to the original text, the author has done an excellant job always keeping an eye on the stage. Amateur dramatic associations would do well in putting this on board. We hope to see many more dramas from this writer.

*Sunday Times*, September 15, 1946.

---

## మహాత్మాజీ విజయయాత్ర

కృష్ణాపత్రిక 2-4-1949

శ్రీ జయరామయ్యగారు మహాత్ముని విజయయాత్రలోని ఘట్టాలను కొన్నిటిని చక్కగా చిత్రించి తమ పాళీని పవిత్రం చేసుకొన్నారు.

వీరిశైలి హాయిగా అణుకువగా నడిచింది. బాపూజీ మీదగల భక్తి పద్య పద్యంలో తొంగిచూస్తోంది. 50 పేజీలుగల గ్రంథమిది. చక్కటి అచ్చు. వేరువేరు శీర్షికల సంపుటి ఇది.

శ్రీ జయరామయ్యగారి కవితకు మచ్చుగా, హత్య గావించుటకు పూర్వం మహాత్ముడు ప్రార్థనకు వస్తున్న దృశ్యాన్ని వర్ణించిన పద్యాన్ని వుదాహరిస్తాను.

* * *

ఆంధ్రప్రభ 19-6-1949

బాపూజీ జీవితంలోని శాంతియాత్రా ఘట్టాలను మధురమైన శైలిలో, సుప్రభాతము, పరితాపము, క్షతగాత్రము మొదలైన వేర్వేరు శీర్షికలక్రింద రచించి, రచయిత ధన్యుడైనాడని చెప్పవచ్చు.

# పెంకిపిల్ల.

ఈనాటకంలో వచ్చే వియ్యంకు లిద్దరిలో ఒకరికి తన గొప్పనే శ్లాఘ్యవగా చెప్పుకునే స్వభావం. రెండో ఆయనకు అవునన్నది కాదనే స్వభావం. వారిద్దరి సంభాషణలు ఎంతో నవ్వు పుట్టిస్తవి. నాటకం మొత్తంమీద బాగానే ఉన్నదని చెప్పవచ్చు.

"జయభారత్" 11-3-51.

---

సాంఘికము: స్టేజి నాటకము. రచయిత: శ్రీ మల్యాల జయరామయ్య. డెమ్మీ 92 పుటలు. వెల రూపాయి. వలయువారు పెద్దాపురములోనున్న గ్రంథకర్త గారికి వ్రాయవలెను.

వ్యావహారికాంధ్రంలో—"కన్యాశుల్కం" ధోరణిలో వ్రాయబడ్డ దృశ్యకావ్యం యిది. ఇది అయిదంకాల నాటకం. ఇందులో వ్యక్తులు మాటల్లో వ్యావహారికాన్నుపయోగించినా, పద్యాలను చక్కని గ్రాంథికంలోనే చదివారు. అవి బాగా పాకంలో పడ్డవే కూడాను... దీన్నిబట్టి కాస్తా రాగం, అవీ అవసరమైనప్పుడు గ్రాంథికమే మేలని గ్రంథకర్త అభిప్రాయమని తోస్తుంది.

పేరు "పెంకిపిల్ల" అయినంతమాత్రాన పెంకిపిల్లగా నటించిన నాయిక అవకతవక వ్యక్తి అని అనుకోనక్కర్లేదు. ఆమె తన ఆదర్శాన్నీ, అభిలాషనీ ఎంతయుక్తిగా నెరవేర్చుకొన్నది, వాటి కోసం ఎలాంటి పెంకితనం చేసినదీ ఇందులో వివరింపబడినందువల్లనే— ఈ దృశ్యానికీ పేరు పెట్టబడినట్లు తెలుస్తువుంది.

ఇందులో కథ చాలా చక్కగా నిర్వహింపబడింది. ఇది చాలా ఏళ్ళ క్రిందటే—చాలాసార్లు ప్రకటింపబడినట్లు గ్రంథకర్త చెప్తున్నారు. ప్రజాదరణం బాగా పొందిందట కూడా. ప్రసిద్ధ నటకులు ఇందులో నటించారట. సంఘ దురాచారాలని అణచడానికి ఇలాంటి నాటకాలు చాలా ఉపయోగిస్తాయి. సాంఘికనాటకాల్లో ఇది చెప్పతగ్గది; ఆదరింపతగ్గది.

బు. వేం. ర.—"కిన్నెర" 1-4-51

---

☞ ఈరచయిత నాటకాలేవి ప్రదర్శించినా ముందుగా రచయిత అనుమతి పొందాలి.